ఓం

శ్రీరామాయ నమః

శ్రీ పంచవక్త్ర హనుమతే నమః

శ్రీ

# బాలాంజనేయము

అను

## శ్రీ సువర్చలాంజనేయకల్యాణము



గ్రంథకర్త

అచ్యుతుని వేంకటాచలపతిరావు

శ్రీ

శ్రీ రామాయ నమః

శ్రీ పంచవక్త్ర హనూమతే నమః.




# బాలాంజనేయము

అను

## శ్రీ సువర్చలాంజనేయ కళ్యాణము



గ్రంథకర్త


అచ్యుతుని వేంకటాచలపతిరావు


—:o:—

బ్రహ్మశ్రీ

వేమూరి శ్రీరంగనాయకులుగా రొసంగిన

ధనసాహాయ్యమున ముద్రితము.

1931



[ అమూల్యము.

శ్రీ

సువర్చలాసమేత పంచముఖాంజనేయ పరబ్రహ్మణే నమః

# అంకితము

[ చతుస్సూత్రి ]

ఓ మిత్యేక మనంత మాద్య మఖిలం
జిజ్ఞాస్యబ్రహ్మాత్మకం
జన్మాద్యస్య యతో భవే త్త మజరం
శాస్త్రాదిహేతుం విభుం
నత్వా వేదసమన్వయైకసులభం
బాలాంజనేయాకృతిం
కుర్వే తచ్చరణాంకితాం కృతి మిమాం
బాలాంజనేయాభిధాం.

ఘనవిజ్ఞానమయస్వరూపము జగ
త్కల్యాణతేజంబు స
న్మునిహృత్పద్మనివాస మాగమరసం
బుఁ "నేహ నానాఽస్తి కిం
చన" యన్నట్టిపదార్థమా కపిసుతుఁ
'బాలాంజనేయంబుఁ గా'
మ్మనుచుఁ దచ్చరణాంకితం బిడెద బ్ర
హ్మానందసంసిద్ధికై.

శ్రీ

# బాలాంజనేయము

ముద్రించుటకు ధనసాహాయ్య మొనర్చిన

బ్రహ్మశ్రీ వేమూరి శ్రీరంగనాయకులుగారు

పొందిన




క॥ శ్రీమ ద్భక్తిలలామా!
ప్రేమరసస్థేమ! రుచిర విద్వత్కామా!
వేమురి శ్రీరంగప్రభా
ధామా! నీవలనఁ గృతికి దారి లభించెన్.

శా॥ సకలైశ్వర్యము లాయురున్నతులు భా
స్వత్పుత్రు లాచంద్రతా
రకసత్కీర్తులు భోగభాగ్యములు శ్రీ
రమ్యంబులౌ గేహముల్
ప్రకటారోగ్యము లాంజనేయపదసే
వాసంపదల్ దివ్యభా
వికులోత్కర్ష లొసంగి మారుతి మిమున్
వేమూరి శ్రీరంగనా
యకభర్తన్ బదివేలకాలములు న
వ్యప్రేమతోఁ బ్రోచుతన్.

మ॥ ధనముల్ గల్గిన లాభమేమి ? కనలే
దా ? ఘోరసంసారబం
ధనముల్ కుత్తుకఁజుట్టి లోభమదమా
త్సర్యాగ్నిసందీపనేం
ధనముల్ బుద్ధిని బుగ్గిసేసి హరిపా
దధ్యానలోపాత్తదం
ధనముల్ ముప్పులు గుప్పి జీవితఫలా
ధారైకదూరత్వనై
ధనముల్ అంపిలి శోకవర్ధనములై
దాహంబు రెట్టింప మీ
ధనముల్ మారుతిభక్తిసాధనములై
ధన్యాత్మ ! వర్ధిల్లుతన్ .

తే॥ గీ॥ అంజనాసుతపదనిలీ ♦ నాంతరంగ
మంది తాము విద్వత్కవు ♦ లగుట నాదు
కృతినిఁ బోషించి నన్నొక్క ♦ కృతిని జేయఁ
బూనినట్లె మారుతి మిమ్ముఁ ♦ బ్రోచుఁగాత॥

ఇట్లు,
బాలాంజనేయ దయాస్వరూపి,
అచ్యుతుని వేంకటాచలపతిరావు,
గ్రంథకర్త.

# ప్రకటన

—:o:—

ఈగ్రంథ ముచితముగ నియ్యఁబడును. వలయు వారు గ్రంథకర్త యొద్దఁగాని, ముద్రాపకుల యొద్దఁగాని స్వయముగ వచ్చి స్వీకరింపఁగలరు.

గ్రంథకర్త

బ్రహ్మశ్రీ అచ్యుతుని వేంకటాచలపతిరావుగారు,

మ్యునిసిపల్ ఆఫీస్, గుంటూరు.

ముద్రాపకులు

బ్రహ్మశ్రీ వేమూరి శ్రీరంగనాయకులుగారు,

ఓవర్సీయర్,

ఉయ్యూరు, నూజవీడు తాలూకా.

బ్రహ్మశ్రీ భాగవతుల అన్నపూర్ణయ్యగారు,

తెనాలి.

# తొలి పలుకు

—:o:—

సీ॥ శ్రీపరాశరమహ ♦ ర్షి ప్రోక్తసంహిత
నార్జించె మున్నె య ♦ న్నయ్యగారు
దానిఁ బోషించి రా ♦ త్మజులు విజ్ఞానసం
పూర్ణులౌ దక్షిణా ♦ మూర్తి శాస్త్రి
లమ్మహాత్మునిపుత్రి ♦ లైపూజ నిలిపిరి
హనుమదార్యాన్నపూ ♦ ర్ణయ్యబుధులు
ఈతండ్రిబిడ్డల ♦ పేరేపణంబుచేఁ
దెలిఁగించె నచ్యుతా ♦ చలవరుండు

తే॥ గీ॥ అన్నయాత్మజాతస్ఫూర్తి ♦ నన్నయాత్మ
జాతభాగవతాన్వయ ♦ ఖ్యాతవిభవ
దక్షిణామూర్తి దివ్యక ♦ టాక్షమహిమ
లెసఁగి మారుతి దయను మా ♦ కొసఁగుఁగాత॥

శ్రీమంతంబై పుణ్యభూమి యనుయసము దెసలఁ బ్రస
రింపఁబంపిన మనయార్యావర్తమునందు సకలార్థముల సమ
కూర్చిపరిజాక్షేమకరములగుసర్వశాస్త్రములరచించి పరిశస్తిఁ

గాంచిన శ్రీపరాశరమహర్షి తొలుఁదొల్త వ్రాసిన "పరా
శరసంహిత" యనుగ్రంథ మొకటి శ్రీయాంజనేయమంత్రోపాస
కులకుఁ బ్రమాణభూతమై పఱఁగుచున్నది. కాని కలికాలదౌ
ర్భాగ్యదశచే నట్టిగ్రంథములకు ముద్రితాకారము లభింప
కయు, శిథిలగ్రంథభాగ సంపూరణలు సేకూరకయు నవి తాళప
త్రాకారములతోనో యముద్రితగ్రంథరూపములతోనో క్వాచి
త్కముగ భక్తులయిండ్లలో నిలిచియున్నవి. ఇట్టిగ్రంథరాజ
మొకటి తెనాలిలో శ్రీహనూమత్ప్రతిష్ఠాద్యనేక ధర్మకార్య
నిర్వాహకులును శ్రీ పంచముఖాంజనేయ భక్తాగ్రేసరులును,
మహత్తరమైన యమనస్కయోగసంసిద్ధులునగు బ్రహ్మశ్రీ
భాగవతుల అన్నయ్యగారిచే సంపాదింపఁబడి వారి కొమారు
లగు బ్రహ్మశ్రీ సాంబదక్షిణామూర్తి శాస్త్రులుగారియింట
నుంట వారి పుత్రరత్నములగు శ్రీ యన్నపూర్ణయ్యగారు
నాకు దయతో నెఱింగించిన నే నానందించి యందలికథా
భాగమును గొంత గ్రహించి నాలుగైదేండ్ల వెనుక నే
"అధ్యాత్మకీర్తనావళి" వ్రాసితిని. దానికానందించి యీకథా
భాగమునే శ్లోకపద్యగద్యగేయమంజర్యాది యుక్తముగ
నొకకాలక్షేపమును వ్రాయుటకు బ్రహ్మశ్రీ సాంబ దక్షిణా
మూర్తిశాస్త్రులుగారు నా కానతి నొసంగ నేను వారల
యాన నౌదలఁదాల్చి బాలాంజనేయ గురుకటాక్షశక్తిచేత
నీసత్కృతి నెట్లో పరిపూర్తిఁ గావించితిని. సంగీతసాహిత్య

విద్యావాసన లేకోశమునఁగానరాని నాబోటులిట్టియుద్యమము సంకల్పించుట హాస్యాస్పదము కావచ్చును. కాని యుడుత కుడుతభక్తి చాలదా యనియు 'నపశబ్దంబులఁ గూడి యున్నఁ బరమేశాలాపముల్ నిత్యమోక్షపదప్రాప్తికి హేతువా' ననియు, 'దారితెక్కలి రాముఁదల్లకిందుగఁబాడి పుట్టతో మోక్షవిభూతిఁ గొనఁడో' యనియుఁ, బలుకుట మన పనియేకాని పలికించెడివాఁడు సర్వభూతాంతర్యామి కలఁడు కదాయనియు వేనవేలుపేరాసలు నాకోర్కులఁ బెద్దసేయ నే నొక్కనాఁ డింతకు సాహసించితిని. కాని నాసాహస మెంతవ అకు ఫలించెనో గుణగ్రహణపారీణు లగు పండితమహాశయులు నిర్ణయింపఁగలరు. ఫలాపేక్షారహితుండనై నే నొనరించినట్టి యీహనూమత్సేవావిధానమునం దేయెడనేని లోపము లుండి నచో నన్నుమన్నింపవలయునని పాఠకమహాశయులకు సహస్ర వినతు లొనరించుచున్నాఁడను.

ఈకథారచనయందు సాయమొసంగుటకు సంగీత సాహి త్యరసకోవిదులచే రచింపఁబడిన యక్షగానకాలక్షేపముల నాదర్శములుగఁ గైకొని యందలిగీతగేయాదులకుఁ బ్రతిబింబ ములను ఛాయలను రచించితిని. ఇట్లున్నంగూడ నచ్చటచ్చట సామాన్యాధునాతనకాలక్షేపసరళిం దాఁటి నడిపించినట్లు పాఠ కమహాశయులకుఁ దోఁచినచో నవి మఱెంతవన్నెఁగూర్చునను నూహాచే వ్రాయఁబడినవే కాన క్షంతవ్యములు. ఈకథలో

నుపన్యాసప్రకరణమును శ్రోతృప్రరోచనార్థమై వ్రాసితినేకాని యుపోద్ఘాతప్రకరణము కథాభాగమునం దత్యావశ్యకము. ఇయ్యది యాంజనేయావతారకథాహేతువివరణ ప్రధానము గాన ముఖ్యము. గ్రంథము పెద్దదై రెండురాత్రుల కాలక్షేపము నకుం జాలియున్నది. చిన్నకథను బెద్దసేయుట దుష్కరముగాని పెద్దకథను సంకుచితముగావించుట కథకునిచేతిలోనిపని యగు టంజేసి సుకరమేకదా యని నే నట్లు కావించితిని. దానంజేసి కథకులు మున్ముం దావశ్యకములగు కథాఘట్టముల నేర్పరిం చునప్పుడు నీరసశకలములనే పోనెట్టి, చెప్పినతమకును వ్రాసిన నాకును మాటం దక్కింప వేడికొనుచున్నాఁడను.

ఈగ్రంథము వ్రాయుటకు నన్నుఁ బ్రోత్సహించినట్టి బ్రహ్మశ్రీ భాగవతుల సాంబదక్షిణామూర్తిశాస్త్రులుగారికిని శ్రీ అన్నపూర్ణయ్యగారికిని, దీనిని ముద్రింపించుటకు ధనసా హాయ్య మొసంగిన బ్రహ్మశ్రీ వేమూరి శ్రీరంగనాయకులు గారికినిఁ జాగిలి వేయినమస్కారము లొనరించుచున్నాఁడను.

ఈగ్రంథమును దయతోను శ్రద్ధతోను ముద్రించిన చంద్రికాముద్రాక్షరశాలాధిపతులకును బ్రహ్మశ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రిగారికిని నాహృదయపూర్వక వందనశతము లర్పించుచున్నాఁడను.

# కవిమనోరథము.

శా॥ శ్రీమంతం బగునచ్యుతాన్వయమునన్
జెల్వొందు కౌండిన్యగో
త్రామేయప్రభుకృష్ణయార్యునకు న
ర్సమ్మందు జన్మించి వి
ద్యామాధుర్యలవంబుఁ గాంచుచు భవ
ద్గాథాసుధాంభోధి వీ
చీమాలన్ విహరించు నే నచలుఁడన్
జేపట్టవే! మారుతీ!

శా॥ శ్రీకళ్యాణగుణాస్పదంబనుచు వా
సింగన్న నీసత్కృపా
లోకానందముఁ గాంక్ష సేసి నినుఁగొ
ల్తున్ గాదె? నీవాఁడనై
నీ కారుణ్యము దేవురించవలెనే?
నీకున్ సగోత్రత్వవి
ఖ్యాకుం డితఁ డటంచునైన దయరా
దా! నన్ను దీవించఁగన్?

చలనములేనిసంపదయు
　　సజ్జనసన్నుత వంశవృద్ధియుౕ,
లలితచిరాయురున్నతి, స
　　లక్షణలక్షితచిద్విభూతి, లో
పలఁ బటుధైర్యదీప్తి, నతి
　　భారపు సంస్కృతికిౕ రవంత భీ
తిలని మనం, బొసంగి నను
　　దేల్చఁగదే! జగదేకపావనీ!

ఓం తత్సత్.

గుంటూరు
ప్రజోత్పత్తి విజయదశమి.

ఇట్లు,
బుధజనవిధేయుఁడు,
అచ్యుతుని వేంకటాచలపతి రావు.



శ్రీ

# బాలాంజనేయము

అను

## సువర్చలాంజనేయకల్యాణము.

( ఉపన్యాసప్రకరణము )

### మారుతిస్తవము

శ్లో॥ ఓంకారశ్రుతిపేయసారభరితాం
దిగ్జాలకూలంకషాం
సీతాజానికథాసుధామధురితాం
భక్తావనైకోద్యమాం
కర్ణా మే శ్రుణుతాం సదా హనుమతో
లోకత్రయే ఖేలత
శ్శ్రీరామామృతపానలీనమనసో
లాంగూలఘంటార్భటీం ॥

సీ॥ ఓ మంచుఁ జెవి కింపు ♦ లో మెడి చప్పుడు
నిగ్గులు నింగికి ♦ నిండి పారల
ఆశాతటీసీమ ♦ లంటి రాపిడివెట్ట
దెసలు పాదులు సల్లి ♦ దసలిపోవ

జానకీపతికథా ♦ గానసుధారస
మిళితమై తీపులఁ ♦ జిలకరింప
భక్తరక్షణకళా ♦ పారీణమౌ హుటా
హుటితోడఁ బరుగెత్తు ♦ పటిమ తోఁప

తే॥ గీ॥ ముజ్జగంబుల నడయాడు ♦ మూర్తిఁదాల్చి
రామపాదనిలీనాంత ♦ రంగ మంది
యమరగణగేయుఁడైన శ్రీ ♦ యాంజనేయు
వాలఘంటాధ్వనులు మమ్ము ♦ నేలుఁగాత॥

అని యిట్లుచలకవి కథానాయకుని సంస్మరించి యీకథ నిర్విఘ్నముగ సమాప్తి నొందఁగలందులకు గణపతిని సరస్వతిని నిట్లు ధ్యానించుచున్నాఁడు.

వినాయక స్తవము.

శ్లో॥ అగజాననపద్మార్కం గజానన మహర్నిశం
అనేకదం తం భక్తానా మేకదంతం నమా మ్యహం॥

కీర్తన.

లంబోదరా ! నమో నమస్తే
శాంభవీసుత ! శుక్లాంబరధర ॥శ్రీలంబో॥
సంతతశుభకర ! అంతకభయహర !
అంతరాయతిమిరోపశాంతికర ॥ లంబో॥
అంబరకేశ హృదంబుజభాస్కర !
అంబుదడంబరతనుభాసా ! హే
రంబ ! వరంబు కరం బొసఁగుచు హృద
యాంబరవీథి ముదంబిడవే॥ శ్రీలంబోదరా॥

విఘ్నాధిపతి నిర్విఘ్నముగ సంస్తుతించి సరస్వతీ దేవిని ప్రార్థింపఁగోరి

## సరస్వతీ ప్రార్థన.

ఉ॥ శ్రీపతి ప్రేమమై సిరిని ♦ జేర్చె నురంబున నట్టులుండ గా
రీపతి భార్యకై నిజశ ♦ రీరములో సగమిచ్చెఁగాదె నే
వీరాపదసేవ సేయ ఫల ♦ మే తలవాకిట నిల్పినారు నే
నోపనటంచు నవ్వనలి ♦ నోద్భవురాణికిఁ జాగిలించెదన్.

తల వాకిలి యనఁగా నోరు, ముంగిటి వాకిలి యనియు నర్థము.

## కీర్తన.

వాణి! పాహి పాహి- వాక్పాటవం నిధేహి మయి-॥ వాణి॥
ఆయాహి - మాజహీహి -
అసేవామహి - పితామహి మాం ॥శ్రీవాణి॥
నిగమాంతవీథీ కేళీ - నిరతాంఘ్రికమల యుగళీ
నిష్యంది మధుసుధాళీ
నిధీయతాం ముఖే మమ శ్రీ॥ వాణి॥
శుభవాణి! తే భవాని తనయ శ్శుకాబ్జపాణీ
అలివేణి! కీరవాణి! గీర్వాణి! బ్రహ్మరాణి!
కరవాణి వందనాని వాణి॥ వాణి॥

## పరమగురు సంకీర్తనము.

శ్లో॥ సంసారేఽస్మిన్ కలుషజనుషాంభోధివీచీగతం మాం
దృష్ట్వా పంకే గళితవచనం కంఠదఘ్నం నిమగ్నం
మాభైషీరి త్యభయ మవదత్ యో విభుస్తం యతీందుం
బ్రహ్మానందం భవభయనుదం మద్గురుం భావయామి॥

మ॥ ఘనసంసారమహాబ్ధిభీకరతరం
గశ్రేణులం దీఁదఁజా
లని నేఁ గుత్తుకబంటిరొంపిఁబడి యు
ల్లాడన్ విలోకించి "నా
యన! భీతిల్లకు" మంచు వెన్ జఱచె బ్రి
హ్మానందయోగీంద్రు లా
యన మున్ వెట్టినపాదుకల్ మనములో
ధ్యానింతు మోక్షార్థినై ॥



శ్రీ

# (ఉపన్యాసము)

(భగవన్నామ సంకీర్తనము: తత్ఫలము.)

కీర్తన.

శ్రీరామా! గుణధామా!
శ్రితజనతారకనామా! జయ! జయ! ॥శ్రీరామా॥
మునిజన మానస వనజా రామా!
ఘనమేఘశ్యామా! రామా! జయ! ॥శ్రీరామా॥
భవదంఘ్రిసరోజాతమరందం
పిబతు సదా చేతో మే జయ! జయ! ॥శ్రీరామా॥

శ్రీమన్నారాయణమూర్తినే సర్వకాలసర్వావస్థలయందుఁ జిత్తంబుల నెడఁబాయనిదీక్షతో ధ్యానించుపుణ్యాత్ములవిభవాతిరేకంబు లాసించి యచలకవివర్యుఁడు

భవదంఘ్రిసరో...... జయజయ శ్రీ॥

యని గానమొనర్చెను. దీనియర్థం బేమియన

తే॥ గీ॥ నీయడుగుఁదమ్ములందుఁ దే ♦ నియలఁ గ్రోలి
యెల్లపుడు నామనంబు రం ♦ జిల్లుఁగాత॥

ఎల్లపుడు రంజిల్లుట దుర్లభమనుకొందురేమో - అట్లు కాదు. నిజమైన భక్తిలక్షణము నొకపారశీకకవి యిట్లు వర్ణించెను.

### కీర్తన.

నిజభక్తి లక్షణము వినవయ్యా - అహ
ర్నిశలు దానికి నెఱుకపడవయ్యా
కదలనియ్యదు నిద్రఁ గననీదు - కూడు
గుడువనియ్యదు దప్పిఁ గొననీదు. (మధుమురళి)

ఇంతయేల మనభాగవతమునందే యిట్లు వర్ణింపఁబడి యుండలేదా?

పానీయంబులఁ ద్రావుచుం గుడుచుచున్ ♦ భాషింపుచున్ హాసలీ
లానిద్రాదులఁ దేలుచున్ దిరుగుచున్ ♦ లక్షించుచున్ సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ ♦ చింతామృతాస్వాదసం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డే ♦ తద్విశ్వమున్ భూవరా॥

కావున నారాయణస్మరణంబు సంతతముం గావించు ధన్యుల భాగ్యము వర్ణనాతీతము. ఈ నారాయణ మంత్రప్రభావ మండఱకు గోచరించుట దుర్లభము.

ఒకానొకనాఁడు భగవన్నామ స్మరణమే వెన్నతోఁబెట్టి పెంచఁబడిన నారదమౌనీంద్రుఁడు తనకే తత్ఫలము విషయమై కొంచెము సందియముతోఁచి నారాయణసన్నిధానంబునం దాసందేహనివృత్తిఁ గావించుకొందమని బయలుదేరి మహతీతంత్రులు శ్రుతులు వెట్టుచుండ వైకుంఠమందిరద్వారంబు డాయంజని శ్రీవిష్ణులోకమును సమీపించుకొలందియుఁ బారవశ్యము జనింప భక్తిచే లీనమగుచూపులతో నిట్లు గానంబు సేయుచున్నాఁడు:

### కీర్తన.

నారాయణ! భవతారణకారణ!
పారావార సుతారమణా!
దీనలోకపరిపాల! మురారే!

దివ్యమంగళాకార ! హరే !
సురవర ! సురుచిర ! సుఖకర ! మురహర ॥నారా॥

అని పాడుకొనుచు వైకుంఠ ద్వారపాలకులయిన జయ విజయులం డాసి.

మంజరి॥ నారాక నెఱింగించుఁడి హరికిఁ
నయకోవిదులారా ! ముద మొలుకఁ
వా రాలోనికిఁ జని శ్రీనాథుఁడు
వైకుంఠంబున లేఁడని పలుకఁ.

గంపెఁడాసతో వచ్చిననారదుం డింతటితో నిరాశచెందక శ్రీవిష్ణుని జాడలు లక్ష్మీదేవి యెఱుంగకుండునాయని యామె సమీపంబున కేగి

కీర్తన.

అమ్మ ! తెలుపవే ! శ్రీహరి యేడకరిగెనో మా॥ యమ్మ
నెమ్మనమునఁగల్గుసందియ మ్మెడుగఁ వచ్చినాఁడ॥ నమ్మ॥

అని ప్రార్థించు మునివరుంజూచి సత్కరించి కటాక్ష వీక్షణములతో నాతనికి బ్రహ్మానంద రసధనముల నొసంగి.

తే॥ గీ॥ తండ్రి ! నారద ! వైకుంఠ ♦ ధాముఁ డిప్పు
డరిగె నెటకొ తదేకని ♦ ష్ఠాత్ముఁడగుచుఁ
దపముచేయుచున్నాఁ డింకఁ ♦ దడవులేదు
మరలివచ్చును గూర్చుండు ♦ మనియె లక్ష్మి.

అనిన మానివరుండు కూర్చుండి శ్రీహరిరాక నిరీక్షించుచు నంతవఱకూరకుండనేల యని కాలము వృథసేయనొల్లక తిరిగి నారాయణుం జూడఁగోరి.

కీర్తన.

సర్గస్థితిలయ కారణ! వారణ
శోకనివారణ! శ్రీరమణా!
మునిజన మానస వనజవిహారే!
మధుకైటభదానవహారే!
సురవర! సురుచిర! సుఖకర! మురహార! ॥నారా॥

ఇంతలో శ్రీహరి ప్రత్యక్షుండై తనమ్రోల నిలంబడియున్నం గని నారదుండు హర్షపులకితాంగుం డగుచు నిటలతలంబునఁ దనకేలుందోయి జోడించి.

కీర్తన.

నిగమఖేల! తే నమో నమో
కరుణాలవాల! తే నమో నమో
దీనపాలకా! నమో నమో
గోపాలబాలకా! నమో నమో॥

నారదా! "ఊరకరారు మహాత్ములు" నీ కేమి కావలయునో కోరుకొ మ్మన్నంత

కీర్తన.

స్వామీ! మీరెచ్చటికిం జనినారలో! ఓ ॥స్వామి॥
ఈ మహిత వైకుంఠధామంబు దిగవిడిచి॥ స్వా॥

నే నతిప్రసంగము చేసితి ననుకొనక నాయం దుద్భవించిన యీ కొత్తసందియములం దీర్చ వేడెదనన్న నారాయణుండు.

కీర్తనా శ్లోకము.

నాహం వసామి వైకుంఠే న యోగిహృదయే రవౌ
మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద!

కావున నీవు నన్నిచటఁ బాడుకొనుచుంట విని యిట కరుగుఁదెంచితిని. భక్తితో నన్నెవ్వరెవ్వ రెక్కడెక్కడఁ బాడుచుందురో నే నక్కడనే తపంబుఁగావించుచు వారక నిలిచి యుందును.

అనిన విని నారదుం డబ్బురంపడి

గీ॥ "ముజ్జగములు మీకై తప ♦ ముం బొనర్పఁ
దపము దేనికై మీరలు ♦ దాల్పవలసె"

అను ప్రశ్నకుం జిఱునగవు నవ్వి "నారదా! మాకుమాత్రము తపము లేదనుకొంటివా ?

భగవదర్చనాపేక్ష త ♦ పంబు మీకు
భక్తసంత్రాణదీక్ష త ♦ పంబు మాకు"

అని బదులొసంగ సంతసిల్లి "స్వామీ! మీరా నారాయణభజన తత్పరుల నెట్లు రక్షింతురో నాకర్థమే కాకున్నది. పుణ్యకార్యము లొనర్చు వారలకే యిక్కట్లు దొంతరలు దొంతరలుగాఁ బైపయిం దొర్లిపడుచుండును.

తే॥ గీ॥ పరమభక్తి మీపాదాబ్జ ♦ నిరతులైన
వారలకె యాపదలు పొర్లి ♦ వచ్చుచుండు
నిన్నుఁదక్క వేఱెవ్వరి ♦ నెఱుఁగనట్టి
సాధుఁ బ్రహ్లాదు రక్కసి ♦ బాధ లిడఁడె?

కావున భాగవతదర్శనంబునను భగవన్నామ స్మరణంబుననుఁ బ్రత్యక్షకష్టము లప్పుడప్పుడు కనుపడుట నటుండనిచ్చి దానివలనఁ బరోక్షఫల మేదైనం గలదేని వివరింపుమ"నిన నారాయణుం డిట్లనియె.

మంజరి॥ పరమరహస్యం బీప్రశ్నం బను
భవవేద్యం బని తెలియవలెఁ
సరగున మాటలతో వివరింపఁగ
సాధ్యమె ? నీవే యెఱుఁగవలెఁ.

కావున నీవే యరిగి హిమాలయమునం దుత్తరశిఖరమున నొక్క రసాల వృక్షాగ్రమునందు రామచిలుక కలదు. దాని నడుగఁబొమ్మన్నంత నే నారదుండు చనిచని యామావిగున్న కడ కేగి రామచిలుకకై వెదకుచు రామనామగానంబు చెవిసోఁకినతావున కేగి.

గీ॥ రామ! రామ! రామాయంచుఁ ♦ బ్రేమమీర
శాఖిశాఖాగ్రమునఁ బాడ ♦ సాగి కొమ్మ
తొట్లెఁ దెమ్మెర లూపఁగాఁ ♦ దూగునట్టి
రామచిలుకను గాంచి నా ♦ రదుఁడు పలికె॥

ఓయీ! శుకరాజమా! ఈయారామసీమలం దా రామస్మరణ భాగ్యము నీకు లభించినది.

చ॥ అనుపమ రామనామమధు ♦ రామృతపానము నీకు సొంపు; దు
ర్జనచరితాంబుధిన్ మునిఁగి ♦ సంతసమందుచుఁ జల్లులాడు టే
మనుజుల కింపు; రామపద ♦ మాధురి జన్మధనంబు నీకు, నీ
యనితరభాగ్య మేమి? చిలు ♦ కా! నరజాతికి బుద్ధి చెప్పవే॥

అని వినుతించి పిదపఁ దనవృత్తాంతంబు నెఱింగించెదనని "చిలుకా! నేను నారదుండను. నారాయణుం డనుప వచ్చినాఁడ. మిమ్మొకప్రశ్నం బడుగఁగోరినపనితో నా మహానుభావుండు నన్నిట కంపించె"

కావున నోశుకమాణిక్యమా! నా విన్నప మాలకించి నా సందేహనివృత్తిం గావించిన నీ దయను బాడుకొం చేగెదను.

కీర్తన.

నారాయణస్మరణే మహత్వం
రే! రే! వద యది జానాసి త్వం ॥నారా॥
పరమభాగవత దర్శనతత్వం
ఫలితం వద యది జానీషే త్వం ॥నారా॥

ఆరామచిలుక నారదునిఁగాంచి నారాయణస్మరణమును జేవినించి తత్క్షణంబ ప్రాణంబుల విడిచి నేలంబడెను - దాని కచ్చెరువంది చింతాక్రాంతుఁడై తిరిగి వైకుంఠుని డాసి శ్రీవిష్ణుని మాయావిలాసంబునకు లోలోన నవ్వుకొనుచు శ్రీహరింజేరి.

కీర్తన.

నీ మాయలన్ బామరు లెటు లెఱుఁగఁదరంబా
చంద్రబింబమెట్లు భూమిఁ జుట్టి ప్రదక్షిణ మొనర్చెఁ
ధరణి యల్లిబిల్లులతోఁ దరణి నెట్లు చుట్టివచ్చెఁ
గాలచక్ర మెట్లు మింట గాలిగిలకపగిది నాడె
గ్రహములు గొబ్బిళ్ళత్రట్లు కరణి నెట్లు సూర్యుఁజుట్టె
వీరినంటఁగట్టి త్రిప్పు దార మెచట దాచితివో
అభిరామా! జితసోమా! గుణధామా! పరంధామా!
పామరు లెటు లెఱుఁగఁ దరంబా నీ మాయలన్.

కావున నోజగదీశా! నా కొక్కమాటతో బదులిచ్చి పంపుండని నారదుండు ప్రార్థించినఁ గాంచి విష్ణుఁ డోనారదా! పుక్కిటిపురాణముల వలన ఫలంబు లేదు. నీవే స్వానుభవంబుచే నెఱుంగఁదగువిషయ మియ్యది. ఓపికతో మరలఁజని కౌశాంబీనగరమున నిగమశర్మయింట నొక్కహోమధేనువు కలదు. దాని నడిగి రమ్మన్నంతనే

మంజరి॥ అంతట విప్రుని కౌశాంబికిఁ జని
యాగోవున్ దర్శించెన్
సంతసమున దాని డాసి మునివరుఁ
డెంతో యలరి ప్రశ్నించెన్.

ఈ గోవునకుంగూడ నేమికీడు మూడునో యని తెలవారుజామున నేగి యజమాను లెఱుంగకుండ నాయావుం జేరి "గోరాజమా!

కీర్తన.

నారాయణస్మరణే మహత్వం
రే! రే! వద యది జానాసి త్వం ॥నారా॥
పరమభాగవత దర్శనతత్వం
ఫలితం వద యది జానీషే త్వం ॥నారా॥

ఆయావు నారదుని దర్శించి హరినామసంస్మరణంబు విని తత్క్షణమే యథాపూర్వము చిలుకవలె ధరంబడెను.

తిరిగి నారదుండు వైకుంఠవాసుని దర్శించి "స్వామీ నన్నింకను బరీక్షింగావింతురా! మీమాయాలీల లెవ్వరి కెఱుక? నే నెచటికి వెళ్ళి నను దురంతములే సంభవించుచున్నవి. ఈపాప మెవ్వరిదో? అచటం జిలుకం జంపితి. ఇచట గోవుం గూల్చితి. ఎందుల కీమాయనాటక మాడించుచున్నారో గదా. మీ మాయల నే నెఱుంగ నెంతవాఁడను?

కీర్తన.

నీమాయలఁ బామరు లెటు లెఱుఁగఁదరంబౌ?
పొద్దుపొడుపు పూల కేమి బుద్ధి చెప్పి నడపించెదో?
సీతాకోకములు కట్టు చీర లెచట నేయించెదో?
కీటము నేమంత్రముతోఁ దేటియట్లు గావించెదో?
రాతిలోనికప్ప కేమి మేత పెట్టి బ్రతికించెదో?
ఇట్టివింతవిద్దెలకుం బుట్టినిల్లు నీవకదా!
అభిరామా! జితకామా! గుణధామా! పరంధామ!
పామరు లెటు లెఱుగఁదరంబౌ నీమాయలఁ!

నీమాయ లగాధములు గాన నన్నింతటితోఁ బంపుమన్నఁ దా నా నారదవచస్సుల కబ్బురంపడి "మునివర్యా! భయము వలదు. నీ కేదురిత మును రాఁజాలదు. విదేహరాజునకుఁ బుత్రుఁడు జనించియున్నాఁడు.

అట్టిఁడే నీసందియముందీర్ప సమర్థుఁడు పొ"మ్మన్నంతనే విని నారదుండు "శుకహత్య గోహత్య లనపాయము లైనవిగాని యీ యాకొమరుం డట్లే యగునేనిఁ జావుదప్పించుకొను టెట్లో ?" యనుకొనుచుఁ జనిచని.

తే॥ గీ॥ గుండె పిచపిచమన నార ♦ దుండు రాజ
మందిరము డాసి జనకస ♦ మక్షమందు
డోలికా కేళికాలీల ♦ నోలలాడు
బాలుఁ గని వానితోఁ బల్కఁ ♦ బాలుపడియె॥

తొట్లె దగ్గర కేగి రాజాజ్ఞ వడసి నారదుండు బాలు నుద్దేశించి "రాకుమారా!" యన్నంతనే శిశువు కనులు తెరచి మునిముఖాంబుజము వీక్షించెను. తదనంతరము నారదుఁడు బాలునితో.

కీర్తన.

నారాయణస్మరణే మహత్వం
రే! రే! వద యది జానాసి త్వం ॥నారా॥
పరమభాగవతదర్శనతత్వం
ఫలితం వద యది జానీషే త్వం! ॥నారా॥

అనిపలికినంతనె బాలుండు నోరుఁదెరచి సన్నని కంఠస్వరముతోఁ బెద్దవారు మాట్లాడుసరణి ననుకరించుచు.

సీ॥ ప్రాకృతసంపదక్ ♦ రామరామాయంచుఁ
బలుక నేర్చిన రామ ♦ చిలుక నేనె
పుణ్యంబు హెచ్చి వి ♦ ప్రునియింటఁ బరిచర్య
గావించు హోమంపు ♦ టావు నేనె!
ప్రాక్తనసుకృతంబు ♦ పండి రాజ్యవిభూతి
దొడ్డఁగాఁ గనురాచ ♦ బిడ్డ నేనె

మరల మిమ్ముఁ గాంచి ♦ హరికీర్తి వింటచే
ముందు బ్రాహ్మణజన్మ ♦ మందు దేనె॥

తే॥ గీ॥ పరమభాగవతుల మిమ్ము ♦ దరిశనంబు
చేసి మీహరిగానంబుఁ ♦ జెవుల వేసి
కొన్నమాత్రాన నాదగు ♦ పున్నె మబ్బి
యుత్తమోత్తమ జన్మ నే ♦ నెత్తినాఁడ॥

అనిన నారదుండు తత్వంబెఱింగి తిరిగి నారాయణస్మరణఁగావించుచుఁ బోనుచు నిజమందిరంబున కరిగెను.

కావున నోభక్తాగ్రేసరులారా! నారాయణ స్మరణంబు చేసినంగాని విన్నంగాని భగవద్భక్తులం గూడినంగాని పాడినంగాని మానవులకు సోపాన ప్రాయమైన యుత్తమోత్తమ జన్మ లభించి పరంపరగా వారల మోక్షంబు నకుం జేర్చుచున్నది.

దీని నెఱింగియుంగూడ మానవులు పూర్వజన్మవాసనాప్రాబల్యమువలన నీశ్వరభక్తి కుదురుటకుఁ బ్రతిబంధకంబగు సంసారజంబాలమునం దొప్పుదోగుచుఁ దమయమూల్యమగు నాయుర్దాయము వృథ పుచ్చుచున్నారు. మానవులజీవితములలో రూపాయకుఁ బావలాతే తుదకు దక్కుచున్నవి.

ఉ॥ ఆయువు నూరువర్షములు ♦ నందు సగంబు నశించు నిద్రచే
నాయరలో సగంబు చను ♦ నంచితబాల్యజరాప్రసక్తిచే॥

ఇట్టిస్థితిలో మనుజునకు భగవచ్చింతన కొకకొన్ని గడియలు మాత్రమే లభించుచున్నవి. కావున నిద్రపోకూడదని పారశీకకవి.

కీర్తన.

చావునకుఁ గవలతమ్ముఁడు కాదె-నిద్ర
సహవాసమును మానుకొనరాదె

గోరిలోపలఁ బండుకొనవచ్చుఁ బిదపఁ
గొల్లకొల్లగ నిద్రఁబోవచ్చు (మధుమురళి)

కావున నీ మనజీవితము లెట్టివనిన.

శ్లో॥ మరణం ప్రకృతి శ్శరీరిణాం
వికృతి ర్జీవిత ముచ్యతే బుధైః
క్షణమ ప్యవతిష్ఠతే శ్వసన్
యది జంతు ర్నను లాభవా నసౌ॥ (కాళిదాసః)

తే॥ గీ॥ మరణమే జీవికి సహజ ♦ మగుటచేత
బ్రతుకుటయ యస్వభావమై ♦ పరగునందు
చూడఁజూడ గడియ శ్వాస ♦ లాడెనేని
జాలు నతనిఁబోలినభాగ్య ♦ శాలి లేఁడు॥

కాల మింతయపూర్వమై యమూల్యమైనను సార్థకము గావించు కొనక యుత్తమ జన్మకు హేతుభూతమగు నారాయణభజన సలుపక

మ॥ సరసీజాక్షపదారవిందయుగళీ
స్యందన్మరందంపుమా
ధురిచేతం దరియింపఁగల్గిన మహా
త్ముల్ చన్న పెందారులం
బరమానందముతోడఁ బాడకయ దు
ష్ప్రారంభులం బాడి వా
నరముల్ త్రోయఁదలంచుచుందు రివెపో
సంసార ఘోరార్భటుల్॥

ఈ సంసారమోహంబులోఁ బడక లోకాభిరామాయణ పారాయణలో మునుంగక కొంతకాలమైనను శ్రీమన్నారాయణు మదిందలంచినచో మానవు లుత్తమపదవి నందఁగలరని తేలుచున్నదిగదా.

ఇంతట నెవ్వరి ధ్యానింపవలయును ? ఎట్లు ధ్యానింపవలయును ? ఈ విషయము కడుంగడు దుర్విజ్ఞేయము. మహానుభావులుసైత మిచటఁ గింకర్తవ్యతామూఢులై యున్నారు. అవలకవి యీయభిప్రాయము నిట్లు విశదీకరించుచున్నాఁడు.

కీర్తన.

దేవ! తవ సేవావిధానం
భావయామి కథం న జానే ॥దేవ॥
సర్వగత పరిపూర్ణ మహో
ఆవాహయామి కథం భవంతం ॥దేవ॥
నిఖిలజగదాధారిణే తే
బ్రూహి కః పీఠో నహి తే॥ దేవ॥
అచ్యుతాచల మాత్మరూప
మహో కథం వందే ప్రభో! భో! ॥దేవ॥

సీసమాలిక

అంతట నిండియు ♦ న్నట్టిని న్నిచ్చోట
నిలువరమ్మని యెట్లు ♦ పిలువనేర్తు ?
అఖిలలోకాధారుఁ ♦ డైనని న్నేరీతిఁ
బీటపైఁ గూర్చుండఁ ♦ బెట్టనేర్తు ?
మురికియే యనుమాట ♦ నెఱుఁగని నీకుఁ గా
ల్గడుగుజలం బెట్టు ♦ లిడఁగనేర్తు ?
నిత్యశుద్ధుండవౌ ♦ నీకెటు లాచమ
నార్థమై తీర్థమి ♦ య్యంగనేర్తు ?
మకిలపట్టని నీదు ♦ మై నెవ్విధిఁ మది
కింపుగా స్నానమా ♦ డింపనేర్తు ?

పదునాల్గు భువనము ♦ లుదరంబునఁ దాల్చు
నట్టినీ కెటు బట్టఁ ♦ గట్టనేర్తు?
నిఖిలంబు తనయందె ♦ నిలిపిన నీ కెట్లు
జన్నిదం బిడి సేవ ♦ సలుపనేర్తు?
కలయజాండములకు ♦ వలభిౘైవడి నున్న
నీ కెట్లు ఛత్రంబు ♦ నిల్పనేర్తు?
వాసన లెఱుఁగక ♦ భాసిల్లు ని న్నెట్లు
పూలతోఁ బూజింపఁ ♦ బూననేర్తు?
నిర్లేపునకు నిత్య ♦ నిర్మలునకు నెట్లు
గందంపు లేప మ ♦ లందనేర్తు?
ఘనజగన్మోహనా ♦ కారవిగ్రహుఁడవౌ
నీ కేమిసొమ్ముల ♦ నియ్యనేర్తు?
ఆకలిలేని ని ♦ త్యాత్మతృప్తున కేమి
నైవేద్య మొసఁగెడి ♦ త్రోవనేర్తు?
నల్దెసల్ నిండి య ♦ నంతుండ వగునీకు
నే ప్రదక్షిణ మెట్లు ♦ నెరపనేర్తు?
వేదమే పొగడఁగా ♦ లేదన్న నే నెట్లు
త్రొక్కుకూఁతలు పాడి ♦ మ్రొక్కనేర్తు?
స్వచ్ఛస్వయంజ్యోతి ♦ వై వెలింగెడినీకు
నీరాజనం బెట్టి ♦ దారినేర్తు?
అంతర్బహిర్వ్యాప్తుఁ ♦ డైయున్న నీకెట్టు
లుద్వాసనంబు సే ♦ యుటకు నేర్తు?

తే॥ గీ॥ ఇట్టి మీవిగ్రహము గుర్తు ♦ పట్టలేక
తటపటాయించు నాదుచి ♦ త్తమున దిగులు
వాపి మీరూపమును గంటఁ ♦ జూపుమయ్య
అచ్యుతాచలభావ! దే ♦ వాదిదేవ!

కావున దారిఁగానక యీశ్వరసేవా విధానమే కడుదుర్లభమని తలంచి భగవంతు నుద్దేశించి యచలుం డేమని వేడుకొనుచున్నాఁడు.

మ॥ తొలిజన్మంబున నిన్నుఁగొల్చితినో లే
దో నేఁటి కీజన్మ నా
కు లభించెఁ గద ముందు నిన్గొలువ లే
కున్నఁ బునర్జన్మమే
కలుగుఁ నీ వెటువంటివాఁడవో యెఱుం
గఁ శక్తి కన్పట్ట దం
జలిఁగావించెద నీవ కైకొని పున
ర్జన్మంబుఁ దప్పింపవే.

భగవంతుని వర్ణనాతీతుని నిర్ణయించుట దుస్సాధ్యమని కాదే త్యాగ రాజముని

కీర్తన.

ఎరవని నిర్ణయించేదిరా! రాము ని
న్నెట్లారాధించేదిరా! నరవరా!
శివుఁడవో లేక కేశవుఁడవో కమలా
భవుఁడవో గాక పరబ్రహ్మమవో ని॥ న్నెవ॥

బ్రహ్మవిష్ణుశివులలో నీ వెవ్వరవు? ఈముమ్వర దాటిన పరాత్పర బ్రహ్మస్వరూపుండవా! యని రామనామతారక మంత్రార్థము నిర్ణయింపఁ గోరి యావివరము నిట్లు విశదీకరించుచున్నాఁడు.

శివమంత్రమునకు 'మ' జీవము మా
ధవమంత్రమునకు 'రా' జీవము ఈ
వివరము తెలిసిన నరులకు మ్రొక్కెద
వితరణగుణ శ్రీత్యాగరాజనుత ॥ఎవ॥

ఏమంత్రమునం దేయక్షరముం బెకలించినచో నామంత్రార్థ మనర్థమగునో యా యక్షర మామంత్రమునకు జీవము. "ఓం నమో నారాయణాయ" యను మంత్రములోనుండి 'రా' తొలఁగింప "ఓం నమో నాయనాయ" యగును. (నాన్యఃపంథా విద్యతేఽయనాయ = మోక్షమున కింకొకదారి లేదు యన్నట్లు) అయనాయ "మోక్షముకొఱకు" యని యర్థము "నాయనాయ" = మోక్షముకొఱకుఁ గాదని యర్థము. అష్టాక్షరినుండి "రా" తొలఁగింపఁగనే మోక్షమునకుఁ గొఱగాక యనిష్టాక్షరీ మంత్రమైనది - ఈ "రా" యష్టాక్షరీ విష్ణుమంత్రజీవము. అట్లే 'నమః శివాయ' యనుమంత్రములోనుండి "మః" తొలఁగింప "న శివాయ" యగును. అనఁగా 'నశుభాయ' న మంగళాయ, యని యర్థము. పంచాక్షరీశివమంత్రము "మః" వీడిన నిర్జీవమై శివమునకుఁగాక, మంచికిఁగాక, మంగళమునకుఁ గాక యమంగళహేతువై పోవుచున్నదికదా. ఈశివవిష్ణు మంత్రముల జీవాక్షరములం జేర్చినచో "రామః" యనునీపేరు వచ్చినది. ఇదే తారకనామము. శివవిష్ణుమంత్రసారము. ఇదియంతయు రామనామ తాత్పర్యవివరము. కావుననే.

"శివమంత్రమునకు 'మ' జీవము ..."

అని త్యాగయ్యగారు వివరించిన యభిప్రాయము.

ఇంతియేగాక, "రామ" నామములో నింకొక గొప్పఁదనము కలదు.

ఉ॥ 'రా' కలుషంబులెల్లఁ బయ
లం బడఁద్రోయును, 'మా' కవాటమై
డీకొను ...,

యని గోపన్నగారు రామునిఁ బాడుకొనెను. ఈ రామశబ్దములోని మాహాత్మ్యమును బరమేశ్వరుండు పార్వతితో.

## కీర్తనాశ్లోకము.

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే
సహస్రనామత స్తుల్యం రామనామ వరాననే!

వేయినామము లన్యము లుచ్చరించినను నొక్కరామనామముతో సాటిరావు. ఈరామనామముతోఁ దరించినమహానుభావు లెందఱో కలరు. ఇయ్యది సర్వజనులకుం దారకనామము. ఈ రామనామజపముతోఁ దరించినమహానుభావులఁ బాడుకొందమా?

సీ॥ దారితెక్కలి రాముఁ ♦ దల్లకిందుగఁబాడి
పుట్టలో మోక్షవి ♦ భూతిఁగొనఁడె
చెఱలోన రామనం ♦ స్మరణంబుఁ గావించి
గోపన్న బంధంబుఁ ♦ బాపుకొనఁడె
మగ్గముకా రామనా ♦ మముతోడ నాడించి
భక్తకబీరుండు ♦ ముక్తిఁగనఁడె
రామకథాసుధా ♦ రసపానరసికుఁడై
తులసిదాసుఁడు రాముఁ ♦ గలసికొనఁడె

తే॥ గీ॥ రామనామనిరంతరా ♦ రాధనైక
మాధురీసాధురీతుల ♦ మఱగి తనిసి
ప్రకృతిలోన నాత్మారామ ♦ పదముదక్క
నొండుఁ గనలేనియాంజనే ♦ యుండు లేఁడె?

నిరంతర రామనామతారక మంత్రజపముచేఁ దరించినభక్తులు కోటానకోట్లుగాఁగలరు. అట్టివారిలో నొకరినిఁ బాడుకొనుచు నీ రెండుగడియలకాలము మనజీవితముల సార్థకపఱచుట మంచిది. ఇట్లే మనమానసముల భాగవతోత్తమకథాశ్రవణముల కలవరచినచో నిరంతరరామస్మరణభాగ్యము మనకుంగూడ లభింపదా? కావున నే యచలకవి.

కీర్తన.

భవదంఘ్రిసరోజాతమరందం
పిబతు సదా చేతో మే జయ జయ
॥శ్రీరామా గుణధామా॥
మునిజనమానస వనజా రామా
ఘనమేఘశ్యామా రామా జయ
॥శ్రీరామా గుణధామ॥
శ్రితజనతారకనామా॥
జయ జయశ్రీ॥

అని గానమొనర్చుచున్నాఁడు. రామభక్తాగ్రియాయి హనుమంతుని కథను బాడుకొనఁదలంచి శ్రీయాంజనేయావతారహేతునిరూపణం గావించుచున్నాఁడు.

(ఉపన్యాసపరికరణము సమాప్తము.)



## ఉపోద్ఘాత ప్రకరణము.

——:o:——

# శ్రీ వృకనారాయణము.

మంజరి॥ శ్రీమంతమయిన పరాశరాశ్రమ
సీమకుఁజని ముదమొలుకఁ
ఆమునిపుంగవుఁ గని మైత్రేయుం
డతివినయముతోఁ బలికెఁ.

సాధో! రే! శృణు! సాధో! రే! శృణు
రామదూత చరితం - రసభరితం
అతిదూరీకృతదురితం - భక్తవ
రాచ్యుతాచలానందమధురితం ॥ సాధో! రే! శృణు॥

ఒకానొకనాఁడు మైత్రేయుండు పరాశరమహానిం డాసి "హే జగద్గురో! భగవన్! నా కింతవఱకుం బొడమిన సమస్తసందేహములను నివర్తించినవి. నా కింకొక్క ధర్మసందేహము నిలిచియున్నది. ఈ లోకత్రయమునందుఁ దా మెఱుంగని విషయమే లేదు.

శ్లో॥ "అత స్త్వాం సంశయం కించిత్ పృష్టుమిచ్ఛామి తత్వతః॥"

కావున నన్ననుగ్రహించి

కీర్తన

తెలియఁజెప్పవే - స్వామి - తెలియఁజెప్పవే.
కల దొక సంశయము మనముఁ
గలఁచుచున్న దది యేమో! ॥ తె॥.
పరమేశ్వరుఁ డాదిగురుఁడు బంధరహితుఁ డకళంకుఁడు
భవభయహరుఁ డఖిలభువనపాలకుఁ డానందమయుఁడు

నాదబిందుకళాతీతుఁ డాదిదేవుఁ డద్వయవిభుఁ
డాదయూళుఁ డాత్మతేజ మంజనలోఁ బొడమఁబెట్టి
యాహ్మై హనుమంతుఁడగుచు రామదాసుఁ డెట్లయ్యెనో॥
తెలియ॥

శ్లో. "కథం పరశివః స్వామీ హనూమద్రూపమాస్థితః
అగమ ద్రామదాసత్వం బ్రూహి భో ! మునిశేఖర ! " ॥

అని యిట్లు ప్రార్థించు మహామునిం గని పరాశరుండు మైత్రేయుం
వంకఁ జూచి మహానుభావుండవు నీ వీప్రశ్న వేయుటకుఁ గారణము.

శ్లో॥ " ఏతల్లోకోపకారాయ పృష్టం జానే మహామునే"

లోకోపకారార్థ మడిగిన యీప్రశ్నమునకు నేను యథాశక్తి బదు
లిచ్చెదనని పరాశరుండు.

తే॥ గీ॥ చెప్పిరిట్లు గదా కపికుల ♦ శేఖరుండు
మడిచిపెట్టెఁ ద్రిశూలరో ♦ మాఖ్యదనుజు.
నతనిమాతులుం డమితభ ♦ యంకరుండు
దనరు గార్దభనిస్వనుఁ ♦ డనెడువాఁడు॥

ఈగార్దభనిస్వనుఁడు త్రిలోకకంటకుఁడై మహాకాయుఁడై చెనక
నలవిగాని యుండ బలపరాక్రమముల విలసిల్లుచు దేవతలందఱు హింసించు
చున్నంత.

మంజరి॥ ఆగాడిదకూఁతకు భళ్ళునదెస
లన్నియు బీటలువారుగ
అతలరసాతలకుతల తలాతల
మంతయుఁ బొడిపొడిగూరుగ.

అట్లు దనుజుండు మనుజాశనదీక్షులో ఘనంబుగ మునింగి నింగి
కెగసి కసిఁబూని నిరంతరము రక్తధారలు గురిపించుచుండఁ జూచిచూచి
సహింపఁజాలక.

శ్లో॥ "ఇంద్రాదయో లోకపాలా యయుః కైలాసమందిరం
బ్రహ్మణా విష్ణునా సార్థం ద్రష్టుం సాక్షా న్మహేశ్వరం ॥"

ఇట్లు దేవతలందఱుం గైలాసముం డాసి గిరిజారమణునకు సాష్టాంగ నమస్కారములు గావించి రిట్లు.

కీర్తన

శంభో! కరుణాంభోనిధే! శంకర! మాం పాహి శరణు.
దంభాసురవిజృంభితసంరంభహర! హర! మహాదేవ॥శంభో॥
జంభారాతిభయంకర దంభోళి కళాప్రభావ!
శుంభద్గార్దభ నిస్వనదంభహర! హర! మహాదేవ॥శంభో॥

అని సంస్తుతించు దేవతలం గనుఁగొని వారల కుచితాసనంబులిడి కూర్చుండఁబెట్టి, తా నుమాసహితుండై హేమసింహాసన మధిష్ఠించి.

మంజరి॥ హరుఁ డటుమ్రొక్కెడివారలఁ గన్గొని
హర్షముతో నిటు పలికెన్.
అర్ధాసనమం దమరినహరిఁగని
యానందము మదిఁ దోలుకన్.

ఇట్లు తమ్ముఁ బ్రశ్నింపఁగోరు శంకరుంగని హరిప్రముఖులు శివ సన్నిధిం జేతులుజోడించి యిట్లని తమయుమ్మలికంబును దివ్వికొనుచు దీన భావంబుగదుర నాకుర్చిరి.

హేలోకశంకరా! దైత్యనాశంకరా! శంకరా!

కీర్తన.

స్వామీ! మామనవి విని మము
నోమి పంపఁగదే - శంభు ॥ స్వా ॥
ఆమాయగార్దభనిస్వనుఁ డిటు
లన్నిజగంబుల నటమటఁ జేసెను ॥స్వా॥
ఏమని విన్నపములు సేతుము

భీమాకారుం డరచినవేళల
నామెయిగాడిదకూఁత కులికి బ్ర
హ్మాండభాండమునఁ బగులు గనంబడె ॥స్వా॥

గాడిద కూసిన జగములు చీకాకై సోఁకుమాఁకలధాకల కోహటింపఁ జాలక ముజ్జగంబును గంధర్వగోళంబులందుంబలెఁ జిందఱవందఱ సెంది కుందు కెట్లన

తే॥ గీ॥ దెసలు చెక్కలు వ్రక్కలై ♦ దసలిపోయె
దిగ్గజంబులు నేలకు ♦ మ్రొగ్గఁబడియె
నాగుపడగల ధర జారి ♦ తూగియాడె
నింగి యేకిన తెలిదూది ♦ భంగి రాలె
గార్దభస్వన మకట చీ ♦ కాకుపెట్టె॥

అని యిట్లు నివేదించు శ్రీహరి ప్రముఖులను జూచి శంకరుఁ డాశ్చర్యముతో నేమిసేయుటకుం దరిఁగానక దేవతల నాలోకించి యర్ధాసనమునం దాసీనుండగు శ్రీహరిముఖాంబుజమును వీక్షించి.

శ్లో॥ 'శంకరః ప్రహసన్ ప్రాహ కిం త్వయాభ్యాగతం హరే?'

భో! దనుజహరా! ఈభాగ్యమునకు నీయంతటివాఁడవే రావలసివచ్చెనుగా యని చిఱునగవు సేసెను. ఈచిఱునగవులో నాపరమేశ్వరుని యభిప్రాయ మెంతో యిమిడియున్నది.

సీసమాలిక.

శ్రీవిష్ణుమూర్తికిఁ ♦ జేతఁగాదో యింత
స్వల్పకార్యం బన్న ♦ సరస మొకటి
నాభక్తవధ మెట్లు ♦ నాచేతనే వీరు
సలిపింతురో యను ♦ సరస మొకటి
మించినశివభక్తిఁ ♦ బెంచు శ్రీపతి దైత్యుఁ
జంపునెట్లో యను ♦ సరస మొకటి

హరిలోని శివభక్తి ♦ పరతకు జయమిచ్చి
సారూప్యముగా నిల్పు ♦ సరస మొకటి
త్రిపురసంహారమం ♦ దుపకృతికిగా మారు
సాయమియ్యంగోరు ♦ సరస మొకటి
అసమానశివభక్తి ♦ కర్హమహా దాస్యము
సంగఁగాఁదలపెట్టు ♦ సరస మొకటి

తే॥ గీ॥ రక్కసుని భక్తి లోక సా ♦ మ్రాజ్యమియ్య
విష్ణునకు శివదాస్య మి ♦ ప్పించవలసి
భక్తులందు నాధిక్యంబు ♦ పరగునపుడు
తారతమ్యరూపముఁ జూపఁ ♦ దలఁచి తనదు
మనమునం దిట్టిపన్నాగ ♦ మనుసరించి
చిఱునగవు నగి బింకముల్ ♦ చెప్పె శివుఁడు ॥

ఇంతగంభీరార్థముగల చిఱునగవుతో శ్రీహరి నుడికింతమని యిట్లనఁ గడంగెను. 'భో ! భో ! గొప్పసందిగ్ధావస్థ దాపురమైనది. ఆదానవుం డజేయుండు. అదియుంగాక శ్రీహరీ! ఇంకొక ముఖ్యకారణమువలనంగూడ నాతని వధింప వలనుపడదు. నాశక్తికిని నీశక్తికినిగూడ దాఁటియున్న దీకార్యము. ఆతఁడు పరమ తపస్సంపన్నుఁడు.

అదియుం గాక వినుము.

కీర్తన.

భోగిశయన! రమాజాని! శ్రీగారుడవాహనా! విను ॥భో॥
ఆగార్దభనిస్వను నే నేగతి వధియింపఁగలను ॥భో॥
పవిసమానశక్తియుతుఁడు శివపూజాధురంధరుఁడు
కువలయమున వానిఁజంప నెవనికిఁదరమౌనో యెఱుఁగ ॥భో॥

సవిశేషత్రిలోకరాజ్య సామ్రాజ్యము నిచ్చినాఁడ.
అవని నతని సరితూఁగెడి శివభక్తుఁడు లేనేలేఁడు ॥భో॥
ఆయసురుం డతిబలుండు. అఖిలలోకదుర్జయుండు
పరమశివజపప్రభావుఁడు భవాదృశుల కలవికాఁడు ॥భో॥

అనిన విని శ్రీహరి చిఱునవ్వు నవ్వి కొంత రోషము దెచ్చికొని "హే లోకశంకరా! శంకరా! మేమందఱముంగూడ నీకు భక్తులముగామా! రాక్షసుండేమి మాకంటె గొప్పశివభక్తుఁడో! లోకకంటకుం డనిదైనను మీరు విచారింప నక్కఱలేదా? మీరిట్లేల పల్కితిరో నా కర్థము గాకున్నది.

శా॥ ఏమీ! తావకపాదపంకజమరం
దేచ్ఛానుభోగోల్లసత్
క్షేమస్థేమశుభాస్పదుండ నగునా
కే దుర్జయుం డయ్యెనో!
నే మీభక్తుఁడఁగానో! రక్కసుఁడు న
న్నే మించెనో! శంకర
స్వామీ! నాశివభక్తితో నసురునిర్జిం
జంపింతునే! చూతువే?"

అని విష్ణుదేవుం డాడినమాటలు శంకరుఁడు వినియు నావెన్నుని మాయావిలాసముల మఱువుఁగనినవాఁడే కావున.

కీర్తన.

సుందరారవిందనయన! ఎందుల కీబింకంబులు?
పందెమేమి నీకు నాకు ముందుగా వచింపు వింద ॥సుంద॥
పంద రక్కసుండని నీ డెందమందుఁ దలఁచితివో
ఎందరు హరిహరులైనను మ్రిందింపరు నాభక్తుని

పంద తక్కసుండని నీడెందమందుఁ దలఁచితివో
సందులెఱిఁగి ఖరనిస్వను డిందసేతువేని యిదే
పందెమిడెద నీయడుగుల యందు దాస్య మొనరించెద
సుందరారవిందనయన పందెమిదే నీకు నాకు॥

అనిశంకరుం డాడినమాటను విని శ్రీహరి రోషముఁబూని శంకరుని
పాదకమలముల కెఱఁగి శివభక్తిరస సంపూర్ణమగు చిత్తమును శంభుపదా
యత్తము గావించి ప్రతిజ్ఞాధురంధరుండై శంకరునికై తిరిగి కేలుఁదమ్మి
ముడిచి "భో! శంభో! దయాంభోనిధే!

శా॥ ప్రోసీ బాలశశాంకమౌళి చరణాం
భోజాతపూజాతప
శ్రీనస్వాంతుఁడనైననాకుఁ దమకుం
లేశంబు భేదంబు రా
దేనిం గార్ధభనిస్వనుం దునిమి రా
నే వత్తుఁ గాకేమి లే
దేనిం దావకదాస్యముం బడసి నే
నే మిమ్ము సేవించెదన్॥

స్వామీ! మీ రిచట నే కూర్చుండుఁడు. ఆరక్కసునిఁద్రుటిలో
వధించివత్తును. తమయందలిభక్తిచే ముప్పిరిగొన్న నాశక్తిని మీ రే మెఱుఁ
గఁగలరు?

శ్లో॥ "కిమత్ర బహునోక్తేన విహారాత్రింబయా సహ
అహమేవ వధిష్యామి పశ్య మే పౌరుషం విభో"॥

తే॥ గీ॥ కోటిబ్రహ్మాండములఁ గోటి ♦ కొనను ద్రిప్పఁ
నీతిలో కైక నాటక ♦ సూత్రధారి

నైననామాయలకుఁ జిక్కి ♦ యాడనట్టి
వారు ధారుణియందు నె ♦ వ్వారు లేరు."

ఈప్రకార మొకరినొకరు ప్రతిజ్ఞలువైచికొని త్రిమూర్తులు వాసవప్రముఖదేవతాగణంబుల మన్నిడుకొని.

మంజరి॥ అనియిటుపందెము లడచి హరిహరులు
నసురుఁడు నిలిచెడిచాయన్.
అనిమిషులఁగలసి మహితానందము
నంది పయనమై పోయెన్.

అట్లుచని రక్కసు నుక్కడించుచక్కనిటక్కరివేస మొక్కఁగడియ దాల్పఁగోరి శ్రీహరి,

తే॥ గీ॥ గార్దభాసురునిన్ జంపఁ ♦ గడఁగి శౌరి
మాయవేషంబు ధరియించి ♦ మాయదారి
రక్కసుఁడు తనవలలోనఁ ♦ జిక్కునట్టి
విధ మెఱిఁగి జగన్మోహన ♦ వేషుఁడయ్యె.

ఇట్లు మోహినీవేష ముద్యానవనములో నెట్లు రక్కసునివలలోఁ వేసికొందుమా యని తిరుగాడుచుండ నామెను రక్కసుండు గని యబ్బురంబు దనచిత్తంబును దబ్బిబ్బుఁగావింప మనం బావుకొనుశక్తిచాలక తనలోఁ దానిట్లని వితర్కించుకొనుచుండె.

కీర్తన.

ఔరౌర ! ఈలేమతీరు - పొగడ - నలవికాదు
దీనిమేనిలోనిమానితంపుసౌరు ॥ ఔ ॥
ఆమోము జాబిలిని దూరు । ఆమోవి తేనె చాలువారు ।
ఆమేన వెన్నెలలు గారు । ఆమెగోరు రంభ గెల్వఁగోరు ।
ఆమెఁగవయ లేనివాని దేమిభోగ మేమియోగ॥ మౌరౌర ॥
ఆమెగిలుకుటందియల బెళుకు । ఆనడకలంటుఁ గలకులుకు ।

ఆపమ్మెద జారినతళుకు । ఆనగవులు సొగసులఁ దొణుకు ।
ఆచానతో సమాన నీజగాన నేను గానలేను॥ ఔరా॥

అని యిట్లు తనలో వర్ణించివర్ణించి తమిపట్టఁజాలక యేదో వ్యాజం బున్నట్టు డాయంబోయి.

మ॥ అతివా! ఎవ్వరిదాన వివ్వనములో
నల్లాడె దెవ్వారికై
సతతా ఘోరశివాంఘ్రియుగ్మభజనా
సంప్రాప్తదేవేంద్రభో
గతతుల్ జుట్టెడివాఁడనం చెఱుఁగవే
కాంతాలలామా! ననుక్
బతిగా నంది త్రిలోకపూజ్యసురసా
మ్రాజ్యంబులక్ దూఁగవే॥

అని యిట్లు తొందరించి ప్రశ్నించుచు బదులు విన నిరీక్షింపక మోహముతలమునుకలైపారిన భరింపఁజాలనితమకంబుతో నామె చేరువకుం జనిచని క్రీగంటిచూడ్కులకే కృతార్థతను దనయం దారోపించుకొనుచు

మంజరి॥ అన విని మోహిని యసురుం గనుగొని
యతిలజ్జాపరవశతక్
గనుపఱచుచు దేవతలం దేరిన
కాంతామణి నే ననుటక్.

రక్కసి మఱింతసంతోషతరంగితాంతరంగుఁడై మోహినీదేవి నిరాక్షేపవాక్యము లాలించి మోహము గుటకలిడుచు జుట్టి, యామెం జేర వచ్చిన "రక్కసుండు సాహసించుచున్నాఁడు. కొంత తొలుఁదొల్త జంకించినంగాని సారస్యము రట్టించి ముప్పరిగొని తమకము గమకముగాఁ బొఱఁడ"ని యూహించి వాని గద్దించు చూడ్కిఁ బరపించుచు.

కీర్తన.

పోర! పోర! పోరా! నిన్నే నారీమణి
కోరునురా?!! పోర! పోర! పోరా॥
తీరుఁజూడ గాడిద వేతీరున నక్క జేరెదవురా॥ పోర॥
ఎక్కడ నిను మించునట్టిచక్కని బాసుకుండు లేడా.
రక్కసి! నీకొక్కవనిత చిక్కి చిక్కు పడునటరా॥
చేరరాకు వాగబోకు గాలిసోకు దూరముగా॥ పోర॥

ఇటు లీసడించునట్టి మోహినింగని యింకఁ గాళ్ళబేరమునకు దిగినం గాని యాటలు సాగిరావని మనోనిశ్చయము గావించుకొన.

మంజరి॥ అని యిటులాడిన గార్దభుఁ డతిరా
గావేశము దయివార్క
మునుకొని మోహిని డాయంజని తన
మోహాము వడికిఁబాలిక

చేరఁబోయి కాళ్ళపయింబడ నుంకించి మోహిని మనసు గఱుగు నట్లు వేడికొందుగాకని.

కీర్తన.

బాలా! జాలమేల? రావ దేల? కేళిఁదేల వేల?
జాలివడఁగఁ జాల! సుగుణజాల! గోల! తాళఁజాల॥ బాలా॥
నేను సకలకళాశాస్త్రి - నిష్ణాతుఁడ రతికుశలుఁడ
చాన! మదిర నానితినా
అనాకములో రంభయుఁ దానోడిపారవలదే॥ బాలా॥
సరసవిటకృపావిశాల సకలశుభకళాలవాల
ప్రకటమదనకదనలోల
భామరో! చాలదయతో నేలుకోవేల॥ బాలా॥

అని యిట్లు వేసుకొనువాని గుఱుతించి తెగునంతవరకు బిగించుట యూడుదానిపనికాదని తాను మెత్తపడినట్లుగ నభినయించుచు.

తే॥ గీ॥ మేటిమగలును నన్ గెల్చు ♦ పాటిగారు
కాన వారికి బలమును ♦ గలుపఁగోరి
పదిలపఱచిన శుభదమా ♦ మదిర ద్రావి
నన్ను గెల్వఁగాఁగల ధైర్య ♦ మున్న రమ్ము॥
ఈమాట లమృతంబులతేటలై చెవిసోకిన గార్దభనిస్వనుండు.

మంజరి॥ గార్దభనిస్వనుఁ డామాటలు విని
గంతిడి మింటనె తూగెన్
కదిలెడిగాలికి వదలినపయ్యెద
గట్టిగఁబట్టుచు లాగెన్.

ఇట్లు పైకొనవచ్చువాని నెఱింగి మోహినీదేవి కనుజూపుల బెదరించినట్లుఁ గొంతసేపు పెనఁగుచు నందక.

ఉ॥ ఊహఁగలంచి రక్కసున
కొక్కడఁ జిక్కియుఁ జిక్కకుండ ని
ర్మోహముతోడ లేనడక
ముద్దులఁగుల్కుచుఁ జేరవచ్చున
న్నాహముఁజూపి సీధువుల
నప్పుడు రక్కసి ముక్కుబంటిగన్
మోహిని పోయ జుఱ్ఱుకొనె
మోహమహాంధుఁడు చేటెఱుంగునే?

అట్లు గొంతుకానఁ గల్లుఁద్రావి కైపు పైపునంతకుఁ జాలక.

మంజరి॥ అసురుఁడు మత్తును గొంతున కానఁగ
నుసురుసురు మనుచుఁ గ్రోల్క
విసరివిసరి రక్కసి దేహము పడ
వేయ నవనిపై వ్రాల్క

అట్లు నిశ్చేష్టుండైన రక్కసిం జూచి మోహినీ వేషము హాళాత్తుగా సాలించి యాగార్దభాసురునిఁ జంపుట కదియే సమయమని భావించి వానికాయము మరణకాలమందు భయంకర గార్దభాకృతిగఁ గన్పట్టిన దాని మాయించుతలంపుతోఁద్రిలోకరక్షణాధారుండగు శ్రీహరి.

మ॥ సకలంబైనచరాచరంబులకు సా
క్షాదృక్షణవ్యాప్తిఁ బూ
నికతోఁ జేయుతలంపు హెచ్చి విబుధా
నీకంబు పొంగారఁగా
వృకనారాయణదేహధారుఁడయి శ్రీ
విక్ దంభవిస్ఫారిత
ప్రకటాభీలఖరాసురాంగముఁ దినెక్
బద్మాక్షుఁ డత్యుగ్రుఁడై.

ఇట్లాగాడిదను భక్షించి పేరు మాన్చి తిరిగి శంఖచక్రగదాదుల ధరించి విష్ణుమూర్తియై నిలచిన శ్రీహరిం డాయవచ్చి సర్వలోక శంకరుఁడగు శంకరుఁడు సాష్టాంగ నమస్కారంబుఁ గావించి తనపరాజయమునకుఁ జింతించునట్లు కనఁబడక ప్రతిజ్ఞానుసారముగ మోకాళ్లపై నిలిచి.

కీర్తన.

సోహం తవదాసోహం శ్రీహరి!
సోహం హరిదాసోహం ॥సోహం॥

ప్రేమోల్లాసీ! మాయామోహితబ్రహ్మాండాంతర్వాసీ!
ఆత్మారామానందవిలాసీ! అచ్యుతాచలవికాసవిభాసీ!
సోహం తవదాసోహం శ్రీహరి ! సోహం హరిదాసోహం॥

అని లేచి చేతులు జోడించి మాధవా ! నన్ను క్షమింపుము. ఇందు నాతప్పు కొంత గలదు.

మంజరి॥ శ్రీహరి నీమహిమల నెఱుఁగక నే
చేసితి నిది నేరంబే
మోహినివేషము నే నెఱుఁగుదు
నీమోహము దాటఁ దరంబే.

కావున నోమాధవా ! రమాధవా !

నీవే నేనని నేనే నీవనుభావముతో ననుఁబ్రోవఁగదే
పావనరూపము దాస్యముఁ గైకొని
పాలింపవె దాసుండన్ ॥శ్రీహరి॥
దోసోహం తవ దాసోహం॥ హరిదాసోహం ॥సోహం॥

అనుమాటల మాధవుఁ డాలించి 'శంభో! తొందరవల దిప్పుడు పుట్టిమునిఁగిన దేదియును లేదు. నీదాస్యము నాకుఁ గావలసినప్పుడు గైకొందునుగాక. స్వామీ! నే తొలుదొల్తనే వచించితింగాదే. ఇదియంతయు నాశివభక్తిపరిభావమే కాని వేఱొం డేదియుఁ గాదనలేదా! నావిన్నప మాలకించి యిప్పుడే ప్రతినలు చెల్లింపఁ దొందరింపక

ఉ॥ ఇంతమహాద్భుతంబు కల
దే శివ! దాస్యము గైకొనంగ నే
నెంతటివాఁడ నీశుఁడను
శ్రే హరునందు యథార్థమంత్రవిధా
స్వాంతము పంతముల్ వదలఁ

జాలనిచో విను ముందుముందుఁ దే
తాంతమునందు రావణవ
ధార్థము రాముఁడ నౌదు నాఁడు ని
శ్చింతగ దాస్యముఁ సలుపఁ
జెల్లును శ్రీహనుమత్స్వరూపినై
యింతకులోన మించిచన
దేదియుఁ బోదమురమ్ము శంకరా!"

అనుచు హరిహరు లొండొరుల భుజములు భుజములపయిం గీలించి కేలంగేలు వట్టుకొని వాసవాది సర్వసుపర్వబృందములతోఁ బయనమై పోయిరని విని మైత్రేయుండు పరాశరు నవలోకించి

కీర్తన.

హే! నిగమవిదితాభరణా! ఓ నిఖలధర్మరసవిచారణా!
శైవవైష్ణవ మొకటియనెడి భావముతో నైక్యమె కద
చేరియొకరినొకరీగతి సేవించుట కేమికతము
శ్రీవిభూ! ప్రభావిశాల! శివుఁడ మోడిపోవనేల॥ హే॥

అని మైత్రేయుం డడిగిన ప్రశ్నంబునకుఁ బరాశరులు సంతసించి "హే మహానుభావా! వీరొకరి కొకరొనర్చునది దాస్యము కాదు. మీరు భ్రాంతిపడఁగూడదు. ఎట్లు మానవుండు రెండు చేతులతోఁ బెద్దబరువులెత్తునో యట్లే వారిద్దఱుంగలసి పనిచేయవలసిన చోటులందు నొకరొకరికి దాస్యమొనరించుచున్న రీతిఁ బరస్పరశక్తియుక్తుల జోడించి నట్లు పనిసేయవలసియున్నది. దీనికిఁ గారణంబేమన

కీ ర్తన.

మైత్రేయమునిచంద్రమా ! విబుధేంద్రమ !
సురుచిర! శుభకర ! భవహర ! విను మిది ॥మై॥
అరయనివారికే హరిహరభేదము
శివుఁ దెలిసికొన్నఁ గేశవుఁ దెలిసికొన్నట్లే
త్రిపురసంహారమున విష్ణుం
డుపకృతిగ శివదాస్య మొసఁగఁడే
అపుడు సేసినదాని కిప్పుడు
కపివరుండై బదులుఁ దీర్చును ॥మై॥

అనియిట్లు పరాశరుండు మైత్రేయుని సమాధానపఱచి తదనంతరంబా తత్త్వ ముపదేశింపఁగోరి యిట్లు బోధించెను.

శ్లో॥ 'శివఏవ హరి స్సాక్షాత్ హరిరేవ శివ స్స్మృతః
ఉభయో రంతరం నాస్తి భేదకృత్ పాప మశ్నుతే॥"

కీ ర్తన.

హరిరేవ హరో హరఏవ హరిః
భువిశౌరిహరౌ మిళితౌ హనుమాన్

దానంజేసి హరిహరస్వరూపుఁ డగుటనకాదే శ్రీహనుమంతుఁడా హరిహరమంత్రార్థజీవాక్షరస్వరూపరామబ్రహ్మోపాసనాతత్పరుండై వాసికెక్కెను. అటుపైన.

మ॥ అనుచున్ మానిపరాశరుం డిటు రహ
స్యార్థంబులన్ జెప్పఁగా
విని మైత్రేయుఁడు సంతసిల్లి త్రిజగ
ద్విఖ్యాత ! తద్వాయునం

దనఁ జేకార్యముఁ దీర్పఁ గల్గెను గళ
త్రంబేడఁ బుట్టెఁ దయా
ఘన! మాకుఁ వివరింపవే యనిన వ
క్కాణించె నవ్వ్యాసియుఁ.

శ్రీహనుమంతుని చరితముఁ జెప్పఁబూని పరాశరులు సున్ముందు శ్రీమారుతికి ధర్మపత్నియగు సువర్చలాదేవి జన్మవృత్తాంత మారంభించుచున్నారు.

## సువర్చలోదయము

మంజరి॥ దేవశిల్పి విశ్వకర్మ కొకకుల
పావని కూఁతురు వొడమెఁ
ఆవెలఁదికి జాతకర్మమున ఛా
యాయనునామం బిడియెఁ.

ఇట్లు దినదినప్రవర్ధమానయగుచున్న ఛాయాకన్యకు వయసువచ్చిన పిదప.

తే॥ గీ॥ వదనబింబంబు నయనముల్ ♦ పదయుగంబు
సరసిజోదారదీప్తి భా ♦ జనములగుట
భావమున రవి భర్తగాఁ ♦ బడయఁగోరెఁ
బద్మినీయోగ్యనాథుండు ♦ భానుఁ డొకఁడె॥

ఇట్లు మనోనిశ్చయంబుఁ గావించుకొని.

మంజరి॥ భావమునఁ దనభర్తగ సూర్యుని
బడయఁగఁ గోరిక వొడమెఁ
ఆవిధంబుఁ దనతండ్రికిఁజెప్ప ' త
థాస్తని యాతఁడు నుడివెఁ.

ఔరా! ఈవిపరీత మెందైనఁగలదే! సూర్యుని భర్తగాఁబడయఁ గోరు కాంతాలలామ లుందురా?

ఉ॥ ఎక్కడిదేవకన్య? మఱి
డెక్కడ? సప్తసముద్రసారముల్
గ్రక్కునఁ జిల్కుచునట్టి శర
కాండప్రచండగభస్తిమాలి, ము
న్నెక్కడఁగంటి మీ మనుము
లింతలు దేవతలందుఁ జెల్లెఁబో
అక్కట మానవాంగనల
యందు స్వయంవర మెట్టులుండునో!

అయ్యలారా! మానవకన్యలు కూడ నిట్టులే స్వయంవరపద్ధతులకై గింజులాడుచున్నారు. దేవతాకన్యకలవలెఁ దమయిచ్చవచ్చిన వారినే గోరికొందు మనుచున్నారు. శారదాబిల్లు మనకుఁగొన్ని క్రొత్త వృత్తాంతములఁ జూపఁగలదు. ఇంతవఱకే చాలినన్ని విపరీతము లున్నవి.

ఈనాఁటి వివాహసంస్కరణములు దేవతలకుంగూడ నసహ్యాకరంబులు కాకేమి? చూచుకొనుండు ముందున్నది ముసళ్లపండుగ.

ఉ॥ కొమ్మలకుఁ స్వతంత్రగతి
గూరిన పశ్చిమదేశభూములం
దమ్మల కయ్యలొక్కనిమి
షాధిపులే, యిది చూచి వేడుకల్
ముమ్మరమై తలిర్పఁ బతి
లోని లొటారముఁ బైఁబటారముఁ
నెమ్మది గుర్తెఱుంగఁగల
నేర్పులు సాలక చేతఁగాని ద
ద్దమ్మలఁగోరి మెచ్చు వని
తామణు లెందఱో ముందుఁజూడుఁడీ.

ప్రస్తుత మనుసరామః పాయసం భక్షయామః

ఇక్కడ మనఛాయాకన్య సూర్యుని వరించుటలో లోపమేమియు లేదు. ఛాయాకన్య ముందువెన్కలఁ బరిగణింపక వరించిన దనరాదు. తా నాభర్తఁ గోరికొనుటకు హేతువు లేకపోదు.

మ॥ జనకుం డింద్రమహేంద్రజాలముల సా
శ్చర్యోచ్ఛలిప్తి, యట్లుండఁ ద
త్తనయారత్నము సూర్యమండలమునం
దారాడుపుర్వాంగ్జి, మెం
దును రవ్వంతకొ అంతకల్గినను ది
గ్దుర్గ దండిస్రయం చాసతో
ననువౌభర్తగ భానునిన్ దలఁచె లే
దా మానసంబొప్పునే?

ఇట్లు సూర్యునిం బెండ్లాడి కాపురమున కేగి కాపురము కొనసాగక తుదకు

మంజరి॥ ఛాయాసతి నిజప్రాణనాథు రవి
డాయలేక వెతఁ బొరలన్
ఏయుపాయమున వేడిమి కోర్వక
యేడ్చుచు నింటికి మరలెన్

ఇట్లు ఛాయంజని తల్లియొద్ద కేగి దీనాననయై

కీర్తన.

అమ్మ! చూడవే! నీ యల్లుని వేడిమికిఁ దాళ ॥నమ్మ॥
నెమ్మది భాస్కరునిఁగోరి యేమి సుఖము గాంచనైతిగ॥ ద॥
కొమ్మలకును జక్కఁదనము గూర్మి మగనికొఱకె కదా
అమ్మ! భర్త ఛాయలేని యతివబ్రతుకు నిష్ఫలముగ॥ ద॥

అని విలపించుముద్దుకూఁతుయొక్క దీనాలాపము లాలించి తల్లి బదులొసంగుటకుఁ జాలినంత ధైర్యము చిక్కఁబట్టకొనఁజాలక కుమారితం జేరదీసి దువ్వి బుజ్జగించి యిట్లనియె

కీర్తన.

ఏమిసేతు తనయా! నే నేమిసేతు తనయా!
నే నేమిసేతు తనయా! ఏమిసేతు తనయా ॥ఏమి॥
నీమగనిక్రిడాయలేక నీవేడ్పుటఁజూడఁజాల॥ నేమి సేతు ॥
ముద్దుమురిపములతోఁ బతియొద్దకుఁ గూఁతురినిఁబంపి
అద్దిర! యిల్లుందు జూడఁడన్నఁ దల్లి యెట్లోర్చును ॥ఏమి॥

అని యిట్లు చింతిలి విశ్వకర్మకడ కేగి తనకుమారితను జూపి యిట్లని ప్రార్థించెను.

శా॥ నాథా! ఈమనపుత్రి భాస్కరునికాం
తారత్నమై గ్రీష్మసం
బాధాభీలత నాథుచెంగటకుఁ బో
వక్ లేక యల్లాడెఁ బ్రే
మాధారంబగునొక్కగాని యొకర
మ్మక్ గాచికోఁజెల్లదే
సాధింపక్ దగు నెట్టులైన రవితీ
క్ష్ణత్వంబుఁ దగ్గింపఁగక్.

ఇట్లు విన్నవించినప్పుడు.

మంజరి॥ అనియిటు తనభార్యామణి పల్కిన
నతిదుఃఖావేశమునక్
ఘనుఁడు విశ్వకర్మ సూర్యబింబముఁ
గని తాఁ గోపవశమునక్.

విశ్వకర్మ యిట్లు సూర్యునిపైఁ గోపము వహించి కనులెఱ్ఱచేసి మహోగ్రుఁడై.

కీర్తన.

ఏమీ! యిటు తగునా ? నీవేడిమి
భీమంబై మాభామ గాసివడె ॥ నేమి॥
ఓమార్తాండ ! భవచ్చండిమఁ దా
నేమాడ్కిన్ భరియించుఁ గుమారిత
ఈమై నీవేడిమిఁ దగ్గించెద
నో మీబింబము బక్కపఱచెదనో ॥ ఏమీ॥

అని యిట్లు కోపించి సూర్యుని వేడిమి నెట్లైనఁ దగ్గింపసమకట్టె.

చ॥ పడఁతి వియోగదుఃఖములఁ
బాల్పడి కుందుట కోర్వలేక యొ
క్కుడు వెతఁజెంది సూర్యుపయిఁ
గోపముఁబూనుచు విశ్వకర్మ నే
ర్పడరఁగ భానుబింబమును
రాచుట కప్పుడు సానవెట్ట రా
పిడిపొడినుండి పుట్టె నర
విందదళాక్షి సువర్చలాభిధన్.

ఈ భానుతేజోరూపిణిం గాంచి దేవత లింతమహాత్మురాలి కెవ్వఁడు భర్త కాఁగలఁడో యని సందియమంది

మంజరి॥ సురవరులందఱు బ్రహ్మలోకమున
సరసిజాసనుని నడుగన్
బిరబిరనడుములు గట్టుచు నచటికి
వెడలిరి యబ్బురపడఁగన్

ఇట్లు చని బ్రహ్మదేవుఁ బ్రశ్నించిన సరసిజోద్భవుండు వారి సంప్రశ్నమునకు సంతసిల్లి యిట్లనె.

కీర్తన

ఓ మహేంద్రదివిజులారా !
నామాటల నాలకింపుఁడో ॥ మహే ॥
ఈమానిని పుణ్యములకు
గని యని మనుకనరో వినరో ॥ ఓమ ॥
ఈమె రవిప్రభాప్రభావధామము సుగుణాభిరామము
భామ వేల్పులేమ యీమె భాగ్యమెంతో యసమానము
మింట రవిని బండనుకొని పంటఁగొఱుకఁగలుగువాఁడు
దంట కోఁతి రామచంద్రు బంటీమెకు మగఁడుసుమీ ॥ ఓమ ॥

ఇట్లుండ లోకములన్నియు సోఁకుమూఁకలచేతఁ జీకాకుపడుచుంటఁ జూచిచూచి.

మంజరి॥ దేవతలందఱు రాక్షసపీడకు
దీనదశల నల్లాడఁగ
పావనమనమున శ్రీహరి పజ్జకుఁ
బయనమయిరి శివుతోడఁగ.

ఇట్లు దేవతలు శివునిఁ బురస్కరించుకొని శ్రీమహావిష్ణుసన్నిధి కరిగి యిట్లని విన్నవింపం దొడంగిరి.

కీర్తన.

స్వామీ! మమ్ము దయఁజూడవె
భీమాసురుల కోర్వలేము
సారకృపాధార ! కలుషవిదార ! శ్రీరమావిహార ॥ స్వామి ॥

ఘోరాకారదనుజసంహారమును గావింపఁజాలిన
వీరవరుని దయసేయవె సారబలాధారకళా
ధారుని ధీరుని నొసఁగుచు ॥స్వామి॥

అని ప్రార్థించు దేవతలం గనుంగొని శ్రీహరి శివు నుద్దేశించి.

మంజరి॥ ఆమాట ల్విని శ్రీహరి సకలే
శ్వరగణతేజోపిండంబున్
శ్రీమహేశ్వరుని చేతికొసంగి వ
చించెం దానంగల డంబున్.

ఇట్లు సకలేశ్వరతేజోపిండము నొక్కదాని నిచ్చి శివునితో శ్రీపతి యిట్లనెను.

కీర్తన

ఈ లోపలఁగలదు ఫాలనయన! వినుము
పాలితదివిజము లాలితతేజము ॥ఈలో॥
ఘోరదనుజకులశూరవిదారము
సారధీరతాధార ముదారము
కొట్టున్ దైత్యులఁ, దగులం బెట్టున్ లంకను, జనకుని
పట్టికి ముద్రికనిచ్చున్, దిట్టకోఁతి జెట్టితేజ ॥మీలో॥

అనిపలికి దీనివలన శివున కింకొక్కమేలు కలుగునని ప్రీతిపాదింపఁదలంచి శ్రీవిష్ణు విట్లని పలుకం దొడంగెను.

శా॥ ఈ తేజోమయదివ్యపిండము కప
ర్దీ! సర్వదేవాంశసం
భూతంబై నిజవైష్ణవద్యుతులఁ బెం
పుం జెందిమీయందు సం

ప్రీతిన్ శంభుకళాపరిధానమయి గౌ
 రీవానరీగర్భసం
జాతంబై హరిదాస్యరూపకప్రతి
 జ్ఞల్ దీర్చి పాలించెడిన్.

ఇట్లు శ్రీహరి తనకర్పించిన తేజమును శివుండు గ్రహించిన నెల్లరు సంతృప్తులై తమతమనివాసములకుం జనిరని పరాశరుండు సెలవిచ్చిన మైత్రేయుం డాలకించి.

శా॥ స్వామీ! ఈ శివతేజ మెప్పగిది భా
 స్వచ్ఛ్రీహనూమత్ప్రభా
ధామంబై విలసిల్లె నంజనకు నే
 దారిన్ లభించెన్ మహో
ద్దామంబైన ప్రతాపవిస్ఫురణతో
 ధాత్రిం బ్రశంసింపఁగా
నేమాడ్కిన్ గపివర్యుఁ డింపెసఁగెఁ దం
 డ్రీ! చెప్పుమం చడ్గినన్.

( ఉపోద్ఘాత ప్రకరణము సమాప్తము. )



శ్రీ

# బాలాంజనేయము

ప్రథమాధ్యాయము

## శివతేజము

మంజరి॥ శ్రీమంతము ముక్తజనావాసము
శ్రీగిరిజా సుఖకరము
కామితదానవిలాసాకర మా
కైలాసగిరిశిఖరము.

సాధో! రే! ఋణు సాధో! రే! ఋణు
రామదూత చరితం రసభరితం
అతిదూరీకృతదురితం భక్తవరా
చ్యుతాచలానంద మధురితం.

ఈ కైలాసమును వర్ణింప నలవికాదు. ఇయ్యది శివభక్తిపరాయణు లకే సులభముగా దొరకునదియేకాని తదితరులకు దుర్లభమయినది. అం దెచ్చటఁజూచినను శివశివేతిధ్వనులు పంచాక్షరీజపములతోఁ బాటుగ దిక్కులందు బ్రహ్మానందకరము లగు ప్రతిధ్వనుల నిచ్చుచుండును.

సీ॥ ఏవంకఁ జూచిన ♦ 'హే! పార్వతీపతే!
కురు దయాం మయి' యను ♦ కోకిలలును
ఏచాయఁ గాంచిన ♦ 'హే నాగభూష! మాం
పాలయ' యనెడి మ ♦ రాళములును

ఏదిక్కుఁ గన్గొన్న • 'హే చంద్రశేఖర !
రక్ష మా' యనెడి హా • ర్యక్షములును
ఏపక్కఁ దిలకింప • 'హే సాంబ! శంభో! ద
యాంభోనిధే! యను • నాలమంద

తే॥ గీ॥ కమ్మపూఁదేనె తినఁబెట్టు • తమ్ములకు "న
మఃశివాయ" మంత్రముఁ జెప్పు • మధుపగణము
లహహ! కైలాసమహిమ లే • మని నుతింతు?
కీటపశుపక్షులకు శివ • కీర్తనంబె॥

ఇచ్చటి కీటములు పశువులు పక్షులుఁ దాము పూర్వజన్మలం దెంతో సుకృతముంగావించినందుననే కైలాసలోకములోఁ దిరుగుభాగ్యము లభించి నది. ఏనాఁడునుంగూడఁ బుణ్య మాచరింపక కాకివలె నుదరపోషణ లాలసులై చరించుచు.

కీర్తన.

కడుపే కైలాస మనుకొనుకలుషాత్ముల కందరానిది
ఉడుపతిధరభక్తజనుల కురకనుఱుకఁ జేరువైనది॥

ఈ కైలాసవిలాసం బెన్నఁదరమె చిద్విలాసము
సాకటశివతాండవపరిభాభరితరసోల్లాసము ॥కడుపే॥
శ్రీకరరుచిరవికాసము శివలీలాంచితభాసము
భీకరదైత్యవినాశము మునిమానసదరహాసము ॥కడుపే॥

అట్టి కైలాసగిరియం దొక్కనాఁడు పార్వతీ పరమేశ్వరులు కేళికాగృహంబునం దుండునపుడు.

మంజరి॥ శంకరుఁ డాగిరిజాసతిఁ గౌఁగిట
సరసవచనములు చిలుకఁగ

పంకజముఖి శశికాంతులు మోమునఁ
బర్వఁగ నిట్లని పలికెన్॥

ఆపురాణ దంపతు లట్లు కేళీసల్లాపము లాడుకొనుచుండఁ బార్వతి తనకోర్కె నిట్లు వివరింపఁ దొడంగెను.

కీర్తన.

స్వామీ! పోదము రావె
భూమీసంచారమునకు॥ స్వామీ॥
ఆమహీతలమున వేంక
టాచలధామము కలదఁట॥ స్వామీ॥

ఆవేంకటాచల పర్వతంబు భయంకరంబై యువిదలకుం జొరరాకున్నది. వలదని నివారించిన వినక "లోకక్షేమంకరమగు మనసంచారముచే దానినిఁ బవిత్రిమొనరింతము లే లె"మ్మని గౌరి నిర్బంధించెను. అంతకుముందు వేంకటాచల మెంతో భయానకమై యుండెనెట్లన.

సీ॥ భీకరహర్యక్ష ♦ భీషణాకారగ
ర్జార్భటీభిన్న ధ ♦ రాధరములు
కూనలు డొక్కల ♦ కున్ వ్రేలఁ గార్చిచ్చు
కులికి పర్వెత్తెడి ♦ కోఁతిమూఁక
మదపానకేళీస • మాగతభ్రమరని
ష్కాసక్రియాలోల ♦ గజగణంబు
చదలుపుట్టలు త్రవ్వి ♦ మొదలంటఁబొడిచి పు
ర్వుల నారగించు కా ♦ రెలుఁగుబంట్లు

తే॥ గీ॥ కొదమచిల్కల కుత్తుకల్ ♦ కొఱుకుకొఱను
మెల్లఁ జెట్ల కెక్కెడిగండు ♦ పిల్లిదండు

విజితవినిపాతితాభీల ♦ వృషకళేబ
రంబు వేంకటాచలపర్వ ♦ తంబు వెలయు॥

ఇంత భయంకరమగు పర్వతస్థలముల కాపురాణదంపతులు డిగ్గి వచ్చి

కీర్తన.

శ్రీశంకరుఁడు గౌరిచేఁ జేయిఁగీలించి
వాసిగ నుద్యానవనవిహారముసేయ
భాసురంబగు వేంకటాచలపర్వతంపు
నికుంజభూమి విలాసములఁ దిరుగుచును
దంపతు లొకసరిలి కూర్చుండి రొకమెడ ॥మారుతీ॥
మారుతిచరితసుధారసధారలో
మాధురిఁ జవిచూడవే - ఓమనసా!
సాధురీతిఁ బాడవే॥—

వా రట్లు గూర్చున్నతటి నా వేంకటాచలపర్వతం బంతయు శాంత తపోవనముభంగి మారి పరస్పరహింసాస్వభావ మలవడిన క్రూరమృగములు సైతము స్నేహభావంబు నందె నెట్లనిన

సీ॥ పాములు డస్సిని ♦ ద్రామ త్తతఁ దూఁగ
ముద్దుగా జోకొట్టు ♦ ముంగిసలును
మేకపిల్లలు నిద్ర ♦ మేల్కొన్న తఱిఁ దేట
జలము లందిచ్చు బె ♦ బ్బులులగుములు
కొదమచిల్కలఁ గూడి ♦ గుజ్జుబువ్వముసేసి
సంబరంపడెడి మా ♦ ర్జాలములును
ఆవులు మెడ లెత్తు ♦ నప్డు పంజాలతో
గంగడోళుల గోకు ♦ సింగములును

తే॥ గీ॥ సచ్చిదానందపరిపూర్ణ ♦ సారమందు
భోక్తృభోజ్యభేదం బెట్లు ♦ పొసఁగరాదొ
అట్టులనె జంతుజాలంబు ♦ లందు నిచట
మేఁత మేఁతరి యనుమాట ♦ మిథ్య యయ్యె॥

ఇంతకుముందుఁ 'గూనలు దమడొక్కలకుఁ వ్రేలఁ గార్చిచ్చు కులికి పర్వెత్తెడికోఁతిమూఁక' లిప్పుడు శివసంచారపవిత్రభావముచే సుఖముగఁ బొదరిండ్లలోఁ జెర్లాటములాడుకొనుచుండ

మంజరి॥ మర్కటమిథునము పొదరిండ్లఁ జేరి
మంబలరారఁ జరింపన్
మానితపురాణదంపతు లది గని
మది సంతస మిగురింపన్.

పార్వతీదేవి తన ప్రాణేశ్వరుని దగ్గరి కడువినయవిధేయ భావము తోలుకాడ నివ్విధంబుగ మనవి సేయం దొడంగెను.

కీర్తన.

నాథా! మన మిద్దఱము వానరులమై
యీధరాభోగసుధాధారఁ గ్రోలుదమే ॥నాథా॥
లోకోత్తరపుణ్యపాకోదయంబున
నీకోఁతిజంట చనుపోకలఁ దూఁగాడ ॥నాథా॥

పార్వతి యిట్టికోర్కులు ప్రాయికముగఁ గోరుచుండును. మున్ను కిరాతార్జునీయగాథలో భిల్లయువతి గాఁగోరలేదా! అయినను మహీతల స్పర్శనమాత్రమున దేవతలుంగూడ నొకానొకప్పుడు మానవమాత్రులగు చుందురేమో. అందువలననే శంకరుఁడు తనభార్య కోరిన విధముగనే కోయవాఁ డిదివఱకైనాఁ డిప్పుడు కోఁతి కావలసియున్నాఁడు. ఇది యంతయు లోకసంగ్రహార్థమేకదా! భార్యలవిషయములోఁ ద్రిమూర్తుల స్వాతంత్ర్యము నేతిబీరకాయ, బంగారు పిచ్చుకలవంటిది. ఎట్లనిన.

ఉ॥ వారిసతీకటాక్షములు ♦ వారినచోటులనే త్రిమూర్తులుం
గారవమిచ్చుచుందు రటు♦గాకయతక్కినందొంగిచూడ రా
కూరిమి భక్తులక్ మనుపఁ♦గోరరు తొల్లిఁది(?)లోకరక్షకై
చేరినవీరు భార్యలఅ♦ చేతులఁ ద్రిప్పెడికీలుబొమ్మలో!

కావున శంకరుండు గౌరియొక్కకోర్కి నీడేర్పం దలంచెను. భూమి మీఁద నడుగువెట్టినంతమాత్రమున మనుష్యసామాన్యమగు వట్టినరచాపల్యము జనించిన దింక వానరచాపల్యము జనింపవలసియున్నది. ఇదియంతయు లోకములమేలునకే కాని వేఱుగాదని మీరేయెఱుంగుదురు. ఇంతటిగతి శంకరునంతటివాని కెట్లు సంభవించినదన్నచో నియ్యది భూలోకప్రభావము.

పార్వతి తన్నిట్లు ప్రార్థించిన విని, శంకరుండు భార్యకోర్కి నీడేర్పందలంచి

కీర్తన.

ఈవిధమునఁ దనయువతి పలికిన
భావమును గుర్తెఱిఁగి శంకర
దేవుఁ డొకమగకోఁతియై గౌ
రీవనిత కపికాంతఁ జేసెను॥
మారుతి చరితసుధారసధారలో
మాఘురీధురిఁ జూడవే ఓమానసా!
సాధురీతిఁ బాడవే॥

వేయిసంవత్సరము లాపురాణదంపతు లిట్లు వానరదేహములతో వేంకటాద్రిపై సంచారముసల్పుచుండ నొక్కనాఁడు.

మంజరి॥ వారలు వానరదేహధారులై
వనములందు విహరింపఁగ
సారసనేత్రికు గిరిజకుఁ దేజ
స్సార మొండు జన్మింపఁగ.

ఇట్లు శివతేజము జన్మింప దాని ధరింపఁజాలక హిమశైలాత్మజ కడుభయంపడి యీశివతేజ మెందేని భూలోకరక్షార్థము కాకుండునాయని

శా॥ ఆనారీమణి పండునిప్పుకణికన్ ♦ వ్యాపించుతీక్ష్ణత్వమున్
లోనన్ నిల్పక యగ్నిగర్భమున కె ♦ ట్లో చేర్చె నాతండు త
ద్భానుప్రస్ఫుటమైన వేఁడిమినిఁ దా ♦ ల్పన్ లేక తత్తేజమున్
బూనంగల్గుసమీరసన్నిధికి స ♦ మ్మోదంబునం దార్చినన్॥

వాయుదేవుండా శైవతేజమును దనయొద్ద నుంచుకొని కాపాడు చుండెను.

ప్రథమాధ్యాయము

శివతేజము

సమాప్తము



శ్రీ

# బాలాంజనేయము

## ద్వితీయాధ్యాయము.

## మారుతిజననము.

శ్రీ వేంకటాద్రిపై నట్లు నివసించు వానర సమూహములందు.

మంజరి॥ కపికులకేసరి సార్థకనాముఁడు
కేసరి యనువాఁ డుండెన్
అపగతకల్మషుఁ డగునతనికి నొక
యంజన యనుసతి యుండెన్.

ఆ నాఁడు లోకములందు రాక్షసబాధ దుస్సహ మగుటం జేసి మానవులకేగాక వనచరములకుఁగూడ దుర్భరంబై తోఁచిన.

ఉ॥ దానవు లిచ్చు బాధలకుఁ • దాళక భీతిలి తద్వధార్థమై
పూనఁ దలంచి సర్వపరి • పూర్ణ బలాఢ్యునిబుత్రిసత్తముఁన్
నేన గడింతునంచు రమ • ణీమణి కేసరికాంతయుఁన్ దపం
బూని చరింపఁ గానలకుఁ • బోయె నఖండమనోరథంబునన్

మానవులకును వానరులకును నెవ్వరికేనియు దుర్లభకార్యముల సాధింప వలయు నన్నఁ దపోబలమే శరణ్యముగాని పశుబల మక్కఱకు రాదు. ఈ యభిప్రాయము.

శ్లో॥ యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుర్లభం
తత్సర్వం తపసా ప్రాప్యం తపో హి దురతిక్రమం॥

అను పెద్దలవాక్యమువలనఁ దేటపడఁగలదు. కావున నంజన తన కలవిగాని కార్యమును సాధింపఁగోరి.

మంజరి॥ గాలికిఁ దనచే రాలుపండ్లు తిని
ఘనమగుదీక్షఁ నిలిపెఁ
కారడవులఁ గేసరిసతి యంజన
ఘోరతపంబుల సలిపెఁ.

ఇట్లు శివధ్యానపరాయణం బగుమానసంబుతోఁ దపంబొనర్చుచు నొక్కనాఁడు శివునిగూర్చి ధ్యానంబు సేయం దలంచి.

సీ॥ మహనీయమార్తాండ ♦ మధ్యందినాఖండ
పటలీగభస్తిసం ♦ పదలవాఁడ
నొసలిమిక్కిలికంటి ♦ బుసఁగొట్టుసెగలతోఁ
బుట్టుకుంకుమచుక్క ♦ బొట్టువాఁడ
సంపూర్ణపూర్ణిమా ♦ చంద్రశీతలకాము
దీస్ఫారచిత్త దీ ♦ ధితులవాఁడ
తలకెంపుజడలందుఁ ♦ దెలినీటితుంపురుల్
చిలికి డాగెడిముద్దు ♦ కలికివాఁడ

తే॥ గీ॥ ప్రళయరౌద్రభయంకర ♦ ప్రభలవాఁడ
ముద్దుసిగఁ దూఁగు నెలతునక ♦ పువ్వవాఁడ
చానసామేనఁ గులుకు మై ♦ సౌరువాఁడ
శివ! మహాప్రభూ! నన్నుర ♦ క్షింపవయ్య.

ఇట్లెన్నెన్నియో వర్షంబులు ధ్యానింప నామె ననుగ్రహించుట కేమో యన్నట్లు గౌరీశంకరు లచట నే వానరరూపములతో నుండిరేకదా! ఇంకొక్కనాఁ డిట్లే శివునిం బాడఁదలంచి యేల నన్ననుగ్రహింపఁడో చూతమని తీవ్రదీక్షతో శంభునిఁ బాడిపాడి ధ్యాననిమీలితనేత్రయై సొమ్మసిల్లి యున్న యంజనాదేవికి,

తే॥ గీ॥ శివసుషుప్తిలో లీనమా ♦ చిత్త మలరఁ
దెరచి యుంచిన యంజనా ♦ కరపుటమున
దినము రాలుపండులభంగిఁ ♦ దేజ మొకటి
వాయుదేవుఁ డాయరచేత ♦ వైచి చనియె.

ఈ తేజమే రాక్షసకులముసలము. సైంధవునితండ్రి యర్ఘ్యమిచ్చునప్పుడు పడిన తలను జేతిలోనుండి విదలించినట్లు త్రోసివేయక, నిక్షేపరాయనివలె ధనరాసులను గనులు మూసికొని దాఁటిపోవక, యున్మత్తునివలె మెడఁ బూలదండ పడినప్పుడు పామని భయముఁజెంది విసరివైవ కాయంచెన.

మంజరి॥ ప్రతిదినమును రాలుపండనుచుఁ గపి
భామ దాని భుజియించెఁ
అతిలోకబ్రహ్మానందకంద
మారగించినటు లెంచెఁ.

ఇట్లాశివతేజమును గర్భస్థము గావించుకొన్నంతనె.

కీర్తన.

కామినీమణి కంజనాసతి కప్పుడప్పుడె గర్భమయ్యెఁ
భామతనదు తపంబునకుఁ బెనుభంగమయ్యెనటంచుఁ దలఁచెను॥
మారుతిచరితసుధారసధారలో మాధురీధురిఁ జూడవే!
ఓ మనసా! సాధురీతిఁ బాడవే॥

ఆకపికాంత తనకిట్లు సద్యోగర్భంబగుట నెఱుంగక యేదో విడ్డూరము సంభవించినదని శంకించి లోలోన సిగ్గుఁజెంది.

కీర్తన

ఏమి యింతవిపరీతము
నామే నతిభార సహిత ॥మిదేమి॥
స్వామీ! నేఁ దపము చేయ
సంకల్పము జరుగనీయ ॥విదేమి॥

పామరులీకథ విని న
న్నేమని మును శంకింతురో
నామది కిది సిగ్గు తోఁచె
నోమహేశ ! లోకనింద
నోమి నన్నుఁ బ్రోవరావ దేవదేవ ॥ ఏమియింత॥

ఇట్లు కొంతకాలము చింతించి "యోమహేశ్వరా! నన్ను నలుగురిలో నేయఁగచాట్లఁ బాలొనర్చి నగుబాటు సేయందలంచితివో కదా! హా దీనదయాళూ! పరిత్యక్తము కావేమి? కాకుందువుగాక యీవిపరీతము తగునా! నిన్నెన్నఁడు గన్నులఁ జూతునోగదా!

శా॥ శ్రీలాలిత్యము తోఁచునీముఖము వీ
క్షింపన్ దలంపూని దీ
క్షాలీలంగని నీవరంబుఁ బడయం
గాఁ గోరి ధ్యానింతు న
న్నేలా తీవ్రపరీక్ష సేసెదవు తం
డ్రీ! గర్భభారం బిదే
మోలజ్జాకరమయ్యెఁ బ్రోవఁగదె శం
భూ! సత్కృపాంభోనిధీ!"

ఇట్లు తా ననేకప్రకారంబులఁ దనయుమ్మలికంబుఁ దెల్పికొని విలపించుచుండ నొకానొకవేళ "హేసాంబశివా! పాహి పాహి"

మంజరి॥ అని విలపించెడి యంజనమ్మ కా
యంబరవాణి వచించెన్
వనితరో! సిగ్గు రవంత వలదు నీ
భాగ్యం బనితర మంచున్॥

ఆకాశవాణికి నంజనయం దనూనమగు దయారసం బుప్పతిల్లి యామె దిగులు వాపఁ దలంచి.

తే॥ గీ॥ రామతారకమంత్రప ♦ రాయణంబు
మూర్తిఁ దాల్చెనో యనునట్లు ♦ కీర్తిఁ గాంచి
తేజరిల్లెడి శాంభవి ♦ తేజ మిదియె
కాని భీతికి హేతువు ♦ కాదు తల్లి !

అను గగనవాణిమాట లాలించి యులికిపడి లేచి తనతపంబు పండి నట్లు లోలోన నుప్పొంగుచునుంగూడ సమగ్రముగఁ దనభాగ్యప్రాప్తిని విందునని చెవియొగ్గినంత నాకాశవాణి మఱియు నిట్లనఁదొడంగె.

కీర్తన.

నీలోపలఁ గలఁడో రమణీమణి
ఫాలాక్షద్యుతి వీరశిఖామణి
సారవివేకవిచారసుధీమణి
శ్రీరామాంఘ్రిసరసిజమధుపాగ్రణి ॥నీలో॥
రక్షస్సంఘవిదారణ
దక్షమహాభుజబలహ
ర్యక్ష శౌర్యదీపితప
ద్మాక్షహరవిరించిసమా
నాక్షయతేజఃపుత్త్రుఁ డొకఁడు ॥నీలో॥

కావున నీవింతటినుండియుఁ దదేకభక్తితో వర్తిల్లుట భావ్యంబు.

మంజరి॥ కావునఁ బావనరామతారకముఁ
గైకొని జపియింపఁదగున్
నీవొనరించు జపంబున రాముని
నిశ్చలభక్తుఁడు కలుగున్.

ఇట్లు గగనసరస్వతి వాకుృచ్చినవిని శ్రీరామపదాంబుజంబులు సెమ్మ దిలోఁ బాదుకొల్పి యంజనాదేవి నిరంతరరామతారకమంత్రజపంబు సేయుట క్షేమంకరమని తలంచి.

మంజరి॥ ధీరయశరీరవాగ్ధార కర్ణామృతపూర
శుభారవాకారమై వెలసెన్
సారప్రమోదపరిసార సంపూర్ణవి
స్తారహృదయపంకేరుహముఁ బడసెన్.

ఇట్లు సంతోషతరంగితాంతరంగముతో ధ్యానంబు సేయఁగోరి కొంతసేపు పాడిపాడి రామభక్తిచే లీనమగుచున్న మానసంబుతో సోలు వేళ మనంబు మరలించి 'హేరామా! పాహి మా' మనుచు

ఉ॥ రామ! దయాలలామ! దిన•రాజకులాంబుధిసోమ! పూర్ణని
ష్కామ! మహాసురప్రకర•సైన్యవిరామ! మనోహరాంబుద
శ్యామ! యశోభిరామ! రస•సాధుహృదంబుజధామ! సద్గుణ
స్తోమ! హిమాద్రిజావినుత•శోభనతారకనామ! పాహి మాం॥

ఇట్లు ధ్యానించి తనివి సనక మానసం బన్యథాచరింపకుండ రామ పాదాబ్జములకు బిగించి

కీర్తన.

రామా! కరుణాలలామ!
రమణీయగుణాబ్ధిసోమ! ॥రామా॥
భామామణి శ్రీమనోభి
రామా! సకలరసధామ! ॥రామా॥
నిఖిలదనుజమదవిరామ
నిగమాంత విహారధామ
కామజనక! హరిహరమహి
మామనోహరా! శ్రీరామా॥ రామా॥

రామామణి గిరిజానుతనామా !
భవభయవిరామ !
అచ్యుతాచల నుతనామ !
అభిరామ! పరంధామా! ॥రామా॥

ఇట్లాయంజనాదేవి నిరంతర రామధ్యానపరాయణచిత్తంబుతో నుండి మరల మరల రాముని ధ్యానించుచుండ నొక్కనాఁడు తదేకనిష్ఠతోఁ బాడుచుండు నంజనాదేవికి వినోదముదోఁప.

తే॥ గీ॥ భామ రామరామాయంచుఁ ♦ బల్కునప్పు
డెచటనుండియొ చెవిసోఁకె ♦ నిట్టిజపము
దెసల మారోగ్రఁత కాదది ♦ తెలివచ్చు
గర్భ నిర్భయార్భక రామ ♦ గాన సరళి.

ఇట్లు రామభక్తిలోఁ దూఁగుచుఁ దనలోని తేజమునుంగూడ నట్లే తూఁగించుచుండ నంజనాదేవిగర్భము ప్రవర్ధమానమై

మంజరి॥ అల వైశాఖబహుళ దశమీ మ
ధ్యాహ్నము శనివారమునన్
సలలితముగ నంజనకున్ మారుతి
జన్మంబందె వరమునన్.

అట్టి మహావీరుఁడు జన్మించుసమయము పుణ్యభరితముగదా. అట్టివారలు జన్మించునప్పుడు సమస్త చరాచరములు సంపూర్ణ సంతోషము నంది తేజరిల్లును గనుక

ఉ॥ అంజనకున్ గుమారుఁ డుద
యం బగువేళ సమస్త దేవతా
కంజదళాక్షు లంచితసు
ఖావహ పుష్పసువృష్టినిచ్చి రం

తం జతురంబుధుల్ గగన
ధామమునంటుచుఁ బొంగిపొర్లె రా
ముం జపియించుచున్ జనన
ముంగనెఁ దొల్తటికేలుమోడ్పుతో॥

ఆ మహాత్ముఁ డెట్లుండెనో వర్ణింప నలవికాదు. పుట్టినప్పుడే సర్వదివ్యపరిపూర్ణ తేజ మమరియుండెను. ఇంకను.

కీర్తన

ప్రబల మహాత్ముఁడు
ప్రఖ్యాత వైష్ణవభక్తిపరాయణుఁడు
త్రిమూర్తిసంభావ్య తేజోమయుఁడు
సమస్తసుపర్వప్రభాయుతుఁడు
మాణిక్యకుండలకాంతిశోభితుఁడు
కనకాంగద హేమమాలాధరుఁడు
మహాభుజుఁడు భీమబలాన్వితుఁడు
అంజనాసుతుఁడు.
పుట్టుజందెమువాఁడు పుట్టగోచికలవాఁడు
దిట్టయై వజ్రమునుగొట్టు శక్తిగలాఁడు.
దీర్ఘకాయుఁడు మహాభుజుఁడున్
దీప్తలాంగూలుండు వీరుఁడు
దేవియంజనబిడ్డఁ డిదె
దేదీప్యమానశరీరుఁ డయ్యెన్.
మారుతిచరితసుధారసధారలో
మాధురీధురిఁ జూడవే ఓ మానసా!
సాధురీతిఁ బాడవే॥

ఈయాంజనేయునకు రామభక్తి జన్మతోడనే లభించినది. ప్రహ్లాదునకుంగూడ నట్లే లభింపలేదా? ఈ శిశువు రామభజనసేయుప్రకారమెట్లున్నదో వినుండు.

సీ॥ కలినీళ్లు చల్లినం ♦ గన్వచ్చి శ్రీరామ
యనుచుం గాననివెతం ♦ గనులుమూయు
భూమీరుహములందు ♦ రామనామము సేయు
చిలుకలకూంతల ♦ కులికి వెదకు
చనుదూటుచో రాముం ♦ గనుగొన్నగతిం దోప
నాకిలింతల బడు ♦ లోసంగుచుండు
రామతారకమంత్ర ♦ రాజంబు ధ్యానసు
షుప్తింగూర్చిన నిద్ర ♦ సోలుచుండు.

తే॥ గీ॥ చిన్నినగవు శ్రీరాముని ♦ గన్నహాయలు
కెవ్వులాట బ్రహ్మానంద ♦ ఖేలనంబు
పొర్లిగింత తన్మయయోగ ♦ భోగగరిమ
కొమరుం డాగర్భరామభ ♦ క్తుండు నిజము.

ఇట్టి మహానుభావులు జన్మమొందుటయన్న నెట్లుండునో మీరెఱుంగకుందురా! సమస్తసృష్టికిం బండుగదినము వంటిది. కాని రాక్షసులకియ్యది దండుగదినము. శిష్టజనుల కందఱు కట్టిమహోత్సవం బెట్లుండు.

కీర్తన.

ఎంతో సంతోషజనకమే సామీరిజననము ॥ దెంతో ॥
స్వాంతమందు సంతసిలి లతాంతవర్షము సురలుకురియ ॥ నెం॥
దుందుభి నిస్వనములు జగమందు మారుమ్రోయంగ
గంధర్వాప్సరఃకిన్నరగణము నాట్యములు సలుపంగ ॥ నెంతో॥

దనుజగణ శిరఃకిరీటఘనమణు లవనిఁ డుల్లఁగ
నసురసతీగర్భపిండము లుసురు లెడలి నేలఁబడఁగ ॥ నెంతో॥
తరువులు సుమములు గురియఁగ సరఘులు ఝుమ్మని పాడఁగఁ
గరువలికిఁ బుత్రోత్సవ కరమై చల్లన విసరఁగ ॥ నెంతో॥

ఇట్లాంజనేయుండు జన్మమంది పురిటింటఁ దేజరిల్లుచుండెను.

ద్వితీయాధ్యాయము

మారుతిజననము

సమాప్తము.



శ్రీ

# బాలాంజనేయము

## తృతీయాధ్యాయము.

## ప్రథమాంకము

శ్రీమంతంబగు వేంకటాచలమునందుఁ బురుడులో నంజనాకుమారుఁ డుండ.

మంజరి॥ అటమీఁద బాలున కైదుదినములు రాఁగ
నమవస చనుదెంచెను
అతఁడు తల్లినిఁ బిలిచి యతిదీనముగ నిట్లు
లామెకుఁ వచియించెను॥

కుమారుం డమానుషబలప్రభావ సంపన్నుండు గావునఁ బ్రౌఢ వచస్సులతో మాట్లాడు శక్తి యలవడి.

కీర్తన.

అమ్మా! నా కాకలోయమ్మా!
నా కారగింపఁబెట్టవమ్మ లేలెమ్మ రమ్మ॥ అమ్మా॥
కమ్మని గుజ్జనగూండ్లఁ గొమ్మని నా కీయవమ్మ
సమ్మతిమై జున్ను మీఁగడ
తెమ్మా! మాయమ్మ లెమ్మ॥ అమ్మా॥

అని తనయుండు వినిపింప విని విచారమునంది కారడవులలోఁ దనకుం దగుసౌకర్యము లలవడ నందులకు దురపిల్లుచు నిజశిశువు నుద్దేశించి ''ఓతండ్రీ.

కీర్తన.

ఎక్కడఁ దెత్తునురా! కుమారా! నే
నెక్కడఁ దెత్తునురా! కుమారా!!
రెక్కలు విరిగినపక్కినిఁ బోలుచు
నిక్కడఁ గానల దిక్కుమాలితి నే ॥నెక్కడ॥
చక్కనిపాలును మీఁగడ చక్కెరతో మేలవించి
మక్కువ గోర్గుజ్జు లెత్తి యొక్కసుతునినోటఁ బెట్టఁ
దక్కువపడి నోఁచనైతి గదర తనయ నే ॥నెక్కడ॥.

అన్నంత నే తల్లి దీనాలాపములకు శంకించి మారుతి జనని కిట్లు విన్న
వింపం దొడంగెను.

కీర్తన

కొల్లగఁ గన్నీరు రాల్చి యుల్లమంమఁ బల్లటిలకు
తల్లీ! నీ వేమి తినెనో యల్లదియే పెట్టవమ్మ
ఓయమ్మా లేలెమ్మా రారమ్మా
నన్నుఁ గన్నమ్మ ॥అమ్మా॥

అన్నంత నంజనాదేవి యాలకించి తనయా!

కీర్తన

ఇక్కడితరుషండంబుల నక్కజముగఁ బండ్లు పండె
చక్కగ నాయిచ్చకొలఁది మెక్కుచుంటి రాలుపండ్లు
నెక్కటిశౌర్యముఁ జూపి నీ వొక్కపండు తినర
సనయ! వినయ! తనయ! నే॥ నెక్కడ॥

అని యిట్లుసెలవొసంగినఁ గుమారుండు తల్లిమాట లాలించి
శ్రీరామునిదయావిభూతితో సర్వదుష్కరకార్యముల సాధించ వచ్చునని
రామభజనముం గడంగి.

కీర్తన

రామా! ముఖజితసోమా! భవనుత
నామా! మేఘశ్యామా! జయజయ॥ రామా॥
గుణధామా! జితకామా!
ఘోరసురారివిరామా! జగదభి॥ రామా॥

ఇట్లు కొంతకాలము ధ్యానించి తనమనోరథంబు వెలిఁబుచ్చఁగోరి.

కీర్తన

దేహి భోజనం-రామ-పాహి తవ జనం
త్రాహి మాజహీహి భో క్షుధార్తభాజనం.
లోకకారణా! సుజనశోకవారణా! రామా॥
భువనభరణ దురితహరణ
భయవిదారణా! రామ! ॥ దేహి భోజనం॥

ఇట్లు ధ్యానించుచుఁ బురిటిమంచములోఁ బరుండి రామపరబ్రహ్మ నందవారాశిలోఁ దేలి నల్దెసలు దిలకించి, ప్రాచీదిక్తటంబున సూర్యుఁ డుదయింపఁబోవుటఁ గాంచి

సీ॥ నాకవాసులకుఁ బు ♦ ణ్యము పండుపండి ప్ర
త్యక్షమౌ కల్పక ♦ వృక్షఫలమొ
నందనారామంబు ♦ నర్త నేలఁ జేరాడఁ
గాచినహేమమౌ ♦ కందఫలమొ
రణధీరు లేరి కూ ♦ రకు సంతరించిన
ఖండశర్కరిలకూ ♦ ష్మాండఫలమొ
గగనసుందరిచేతి ♦ జిగిటీపు లీను వి
శాలమాధుర్యర ♦ సాలఫలమొ

తే॥ గీ॥ శ్రుతిపథమునందుఁ గల పరం • జ్యోతిఁ బుట్టు
రమ్యసచ్చిదానందైక • రామఫలము
యని భుజింపఁగాఁ గోరి యా • యనిలసుతుఁడు
పొంగి నింగికి రింగునఁ • జెంగలించె.

కీర్తన

ఆడెడుబిడ్డండై దవనాఁడు పొత్తులం బరుండి
వేడిసూర్యుఁ డుదయించుటఁ జూడఁగనే పండనుకొని
ఆపండును దినఁగోరుచుఁ బావఁడు మిన్నుల కెగసి ప్రి
తాపము శౌర్యము ధైర్యము దీపింపఁగ రవిని బెట్టికె
మారుతికథాసుధారసధార మాధురీధురీణము
సాధురీతిఁ బొగడువారికి
సకలసుఖదపారీణము ॥ మారుతి ॥

ఇట్లప్పుడప్పు డుదయించుచున్న భానుబింబమును గబళింపవచ్చినటని రాహువు దొదవ్వులఁ జూచి

మంజరి॥ సాహసమునఁ గోఁతిపిల్ల సూర్యుని
జప్పరించె నవలీలన్
రాహువు కోపము మండిపడఁగఁబూ
ర్ణాహుతవహ్నిని బోలెన్

ఇట్లారాహువు కోపోద్దీపితుండై తాటినెక్కు వానికిఁ దలఁదన్ను వాఁ డెవ్వఁడో వచ్చెనని యహంకార మూని చేరంబోయి కోఁతిపిల్లను గద్దించిన విడిచిపెట్టునేమోయను పేరాసతో "ఒరే! వానరబాలకా".

కీర్తన

ఎవఁడవు నాపైపోటి కెంచుకువచ్చినాఁడ ॥ వెవఁడవు॥
దవుడఁ బగులఁ గొట్టింతుఁ
దడవులేదు నిలు నిలు నిలు ॥ మెవఁడ ॥

రాహువె సూర్యుని మ్రింగఁగ సాహసింపఁ దగినవాఁడు
నీహోయ లెక్కడఁ జూచితి
మాహా! నాసూర్యుఁ దాఁక ॥ నెవఁడవు॥

విధి సూర్యుని నాభోజన విధికయి నిర్ణయ మొనర్చె
నధికచపలచిత్తా! నా
యధికారము నీవు పూన ॥ నెవఁడవు॥

సూర్యుం డట్లు కపిముఖంబునఁ జిక్కుపడఁ బ్రపంచమంతయు నల్ల కల్లోలముకాదా? ఈగతి గమనింపుఁడు. అప్పు డెట్లుండెనన

సీ॥ అరుణుండు నడుములు ♦ విరిగి పర్విడ శక్తి
లేక కొండల రాళ్ల ♦ దేఁకులాడ
అలసి వేకువఁ బండు ♦ జలజనేత్రిలు పొద్దు
పొడువ లేదని నిద్రఁ ♦ పోవుచుండ
రవికి సంపూర్ణోప ♦ రాగ మెక్కడిదంచు
జోస్యులు లెక్కలఁ ♦ జూడఁబోవ
బ్రహ్మాయామమునందుఁ ♦ బఱియించువడుగులు
తెల్లవార దటంచుఁ ♦ బల్లటిల్ల
తమ్మిబందెలఁజిక్కి ♦ తప్పఁదాగిన తేఁట్లు
ముక్తికై చెఱసాల ♦ మూల్గువెట్ట
తొలి రేకుల౯ విచ్చి ♦ వలపుతోఁ బద్మినుల్
మంచు కన్నీరు రా ♦ ల్పించఁ దొడఁగ.

తే॥ గీ॥ పొడుపువెలుఁగున కెడఁద ను ♦ ప్పొంగునట్టి
జక్కవలకుఁ గాల్సేతులు ♦ చల్లవడఁగ
నగ్రిజన్ములు పాతెర ♦ ఘర్ఘ్యవిదాన

జలము లఱచేత నిడి తూర్పుఁ ♦ గలయ వెదుక
భానుబింబమ్మున్ గన్గొన ♦ లేని భువన
గోళమంతయుఁ గందర ♦ గోళమయ్యె.

ఇట్లు జగ మగడుపడుచుండ నయ్యెడ రాహువు తనచేత నే కోఁతిని వారింపఁజేతఁగాక యింద్రుని డాయంబరుగెత్తి విన్నవించిన.

మంజరి॥ అపుడు మహేంద్రుఁడు రవికొఱకై యుద
యాద్రిశిఖరమంతటఁ దిలకించెన్
అర్కబింబ మొకయప్పడమ్మున్ బలె
నారగించు కపిబాలుని గాంచెన్.

తదనంతరంబ తత్తరపాటుతో నింద్రుండు వజ్రమునకై పరుగులు వెట్టి దేవతలందఱుం బిలిచి వారలతో.

కీర్తన.

అక్కటకట కోఁతిపిల్ల మెక్కఁ దొడఁగె భాస్కరునిన్
జిక్కఁబట్టుఁ డనుచుఁ దనదు చేతివజ్రమును విసరెను
మారుతికథాసుధారసధార మాధురీధురీణము.

ఇట్లింద్రుండు వజ్రముం బ్రయోగించినఁ గపికిశోరంబు

మంజరి॥ ఆవజ్రము దాదవ్వులఁ గని భయ
మందక ధైర్యముఁ బెంచెన్
అర్భకుఁ డొకరోమము మంత్రించుచు
నడ్డుపెట్టఁ బంపించెన్.

అప్పు డాకపికుమారుండు పిక్కరోమ మొం డూడఁబెఱికి దాదవ్వులనున్న వజ్రము తన్నుడాయకయమునుపె శ్రీరామచరణారవిందములకుఁ దనమానససరోవరంబునం దెప్పతిరునాళ్లఁ గావించుచు

హే! రామా! రాక్షసవిరామా!

కీర్తన

మాం పాలయ దయాలయ ! రామ ! ॥ మాం ॥
మమ మానసహంసం ఖేలయ ॥ మాం ॥
రామ ! తావకపదాంభోజమధుధా
రామాధురీవిలోలరోలంబం ॥ మాం ॥
అక్కడ నిందువజ్రాయుధంబుజాడ
లక్కటకట యెట్లు చక్కాడంగలాఁడ
దిక్కు నీవనుచు దేవురించినాఁడ
గ్రక్కున రావే శ్రీరామా ! నే నీవాఁడ ॥ మాం ॥

అని యిట్లు శ్రీరాముని బాడుకొని తనకాలిరోమంబును బైకెత్తి, ప్రతిజ్ఞాధురంధరుండై యంజనాకుమారుండు, పంచభూతస్థేమా ! త్రిమూర్తిబలధామా ! శ్రీరామా !

శా॥ రామా ! తావకపాదపద్మమధుధా • రాసారపారీణమై
నేమంబొప్పఁగ నాదుమానసము ని•న్నే కొల్చునేనిన్ జగ
త్స్వామీ ! నేనొకకోఁతిపిల్లను భవ•ద్భక్తుండ నౌదేని నా
రోమం బిందువజ్రసారమును ని•ర్మూలించిఖండించుతన్

అని యిట్లు ప్రయోగించినపుడా రోమంబునందు రామునిశక్తి ప్రవేశించుటంజేసి యది సర్వదేవతాసారస్వరూపమై భూనభోంతరాళంబులందన గమనధాటీధ్వానములచే మార్మ్రోఁతలు వెట్టించుచుఁ జెవులఁజెవుడు పఱచునట్లు చనిచని వజ్రముం దాఁకిన.

మంజరి॥ ఇందువజ్రము చిందఱవందఱఁ
జెంది ధరంబడఁ గూలెన్
తండ్రి డింది దివిజేంద్రుఁడు బ్రహ్మను
దర్శింప బయల్వెడలెన్.

ఇట్లింద్రుఁడు బ్రహ్మలోకంబునకుం జని విధాతను దర్శించి యిట్లని సంస్తుతింపఁదొడంగెను.

కీర్తన

వాణీనాయకా! నిర్వాణదాయకా! దేవ!
ప్రాణికోటిపాపపుణ్యఫలవిధాయకా! ॥దేవ॥
వేదభూషణా! సుజనఖేదశోషణా! దేవ
శ్రుతినాయక!
సుఖదాయక!
శుభవిధాయక! దేవ ॥వాణీనాయకా॥

ఇట్లు సంస్తుతించి చేతులు జోడించి మహేంద్రుండు కపివృత్తాంతంబు విన్పింపఁదలంచి సంక్షేపసరళిలో నా బ్రహ్మదేవుని కిట్లని విన్నవింపఁ దొడంగె.

మంజరి॥ కోఁతిపిల్ల మనకొంపఁదీసి రవిఁ
గోఱికి భుజింపఁదొడంగెన్
చేతివజ్రమును విసరితి నదియును
జితుకులగుచు ధరఁ గ్రుంగెన్.

అని యీప్రకారము విన్నవించిన బ్రహ్మదేవుం డాశ్చర్యపడి.

శా॥ ఆమాట ల్విని బ్రహ్మదేవుఁడు మహా
హంకారపంకంబుతో
నేమీ! కోఁతికి భీతిలన్ వలసెఁగా
దే! సూర్యునిన్ మ్రింగ నే
లా! మాబ్రహ్మమహాస్త్రమున్ బఱపి కూ
ల్పన్ వచ్చు రాపోద మే

భూమిఁ బుట్టెను గోత్రిపిల్లలకు సం
పూర్ణపరిభావాఢ్యతల్.

అనుచు వారిద్దఱుం గలసి యాంజనేయుం డున్నచోటికిం జని.

మంజరి॥ బ్రహ్మాస్త్రంబుఁ బ్రయోగించుటకయి
బ్రహ్మదేవుఁడు దలంచెఁ
జిహ్మగ మెదుర్వైరాకమునుపె కపి
శేఖరుఁ డిట్లు నుతించెఁ.

ఇట్లు శ్రీరామపాదాంబుజయుగళిం దనచిత్తమునఁ బాడుకొల్పి.

కీర్తన

రామా! జగదభిరామా! వందే॥
రమ్యగుణాంబుధిసోమా! శ్రీరామా ॥రామా॥
వాచామగోచరధామ! రామ॥
నీచదానవసమాజవిరామా! ॥రామా॥
మునిజనమానసవనరుహధామా!
ఘనతులసీదళదామా! శ్రీరామా! ॥రామా॥
సుకవిజనవినుతసుగుణస్తోమా!
అకలుషతారకనామా! శ్రీరామా ॥రామా॥
ఆగమాంతనుతదైవలలామా!
అచలభక్తహృదారామా! శ్రీరామా! ॥రామా॥

అని యిట్లు వినుతించి పిక్కరోమము నింకొక్కదాని నూడఁబెఱికి మంత్రించి.

పంచభూతాభిరామా! సకలగుణస్తోమా! జగదభిరామా! రామా!

శా॥ నేనే రామపదాంబుజాతమహిమో
న్నిష్ఠాగరిష్ఠుండనా
దేని౯ దారకనామసంతతజపా
ధీనాంతరంగుండనా
దేని౯ శాంభవదీప్తి నాతనువులోఁ
దీండ్రించి వెల్గొందునే
నీనారోమము తాతయస్త్రముఁ గళా
హీనంబుఁగావించుత౯.

అని ప్రయోగించిన నదియు సర్వదైవతతేజస్సారస్వరూపమై పారి పయుగు లెత్తె.

మంజరి॥ అజుఁడటు బ్రహ్మాస్త్రము మర్కటశిశు
వడల నేయఁ గుటివెట్టె౯.
భుజబలమునఁ బిక్కరోమమున దానిఁ
బింజపింజగాఁ గొట్టె౯.

దానిఁగన్నులారఁగాంచి సిగ్గుసెంది బ్రహ్మదేవుండు వేఱొకగతిఁ గానక.

తే॥ గీ॥ తొలుత నింద్రుఁడు దంభోళి ◆ తునుకలగుట
సిగ్గుచే నేల నాకుచు ◆ బొగ్గుఁగఱచె
అజునిబ్రహ్మాస్త్రమే గజ ◆ బిజవడంగ
భ్రమవిడిచి బ్రహ్మ కాళ్ళబే ◆ రముకుఁ జొచ్చె.

చ॥ అనితరతేజ ముట్టిపడు
నట్టిల వైరులఁగూల్చునస్త్రమే
తునుకలుగా ధరంబడి య
ధోగతిఁగాంచినఁ జూచి బ్రహ్మ పె

న్వనట మునింగి "వానరుఁడ
వారితవిక్రమచక్రవర్తి యీ
తనిఁ గెడపం దరంబగునె
దాసులతప్పుకు దండమే క్షమా
పన" మనుచుఁ మహేంద్రుఁడును
బ్రహ్మయుఁ బోయి నమస్కరించిరన్.

కపికుమారునెదుట వారిద్దఱు నిలువంబడి చేతులు జోడించి దీనుల భంగి వినయ విధేయభావంబుఁ దోలుకాడించుచు నిట్లు ప్రార్థింపఁ దొడంగిరి.

కీర్తన

ఓస్వామీ! మముఁ బ్రోవవే మేము
నీమహిమ లెఱుంగఁజాల
కీమాడ్కిఁ జేసితి మో॥ స్వామీ॥.
కపికులకిశోరా! కనకమాలాధరా!
కారుణ్యసాగరా! శ్రీ గౌరీతేజస్సార! ॥స్వామి॥
అంజనాసతికుమారా! అఖిలలోకాధార!
సురనరమునిహితకారా! పరమభక్తమందార! ॥స్వా॥

అని యిట్లు కొంతకాలము సంస్తుతించి యెట్టకేలకుఁ బ్రస్తుతము ననుసరింపఁదలంచి తమమనోరథమును నిరూపింప సమకట్టి.

భానుఁడు తమపంటనుంటఁ
బాడువడియె మాక్రతువులు
దీనదయాళూ! సూర్యునిఁ
దినక విడిచిపెట్టఁగదవె ॥స్వామీ॥

వార లిట్లు ప్రార్థింప నాలించి జాలింగన్నచిత్తంబుతో నావానర కుమారుండు తనమనంబునం దమందానందంబు తొలుకాడ నిట్లనివితర్కించుకొనుచు

చ॥ త్రొడఁబడి వజ్రిముష్టి విసరి
తూలె మహేంద్రుఁడు, పద్మలోనఁ గా
లిడె జలజాసనుండు, జయ
మే సమకూరెను భాను నింతటన్
విడిచిన లోకసంగ్రహము,
నే నటు చేసెదనంచు జాలి లో
నడర రచించె, భక్తుల మ
నోంబుజముల్ నవనీతసారముల్.

ఇట్లు కనికరముఁబూని వారల ననుగ్రహింపనెంచి, మారుతి విన యముఁ గనుపఱచుచు

మంజరి॥ బ్రహ్మమహేంద్రులు! మీరలసంస్తుతిఁ
బడయఁగ నెంతటివాఁడన్
భానుబింబమును లోకరక్షకై
భక్షింపక విడినాఁడన్.

అని వారలంగూర్చి వచించుచు సూర్యుని నధోముఖమున విడిచి పెట్టినంతనె లోకంబు లమందానందకందళితహృదయంబు లయ్యెను. ప్రపంచమంతయు నానందవారాన్నిధిం దూఁగియాడున ట్లుండెను. ఇట్లు తిరిగి బాలభానుఁ డుదయమందునప్పు డున్న స్థితి వర్ణింపఁ దరము కాదు.

సీ॥ ఉదయేందిరాసతీ ♦ హృదయపీఠలస
ద్దివికాంతహీరహా ♦ రాగ్రమణియొ
పొడుపుఁగొండల బోయ ♦ బుడుతలు నింగిలోఁ
బట్టి యాడెడిగాలి ♦ పడగ వెలుఁగొ
అంజనాసుతవిక్రి ♦ మాలోకనాద్భుత
రాగరంజితపర ♦ బ్రహ్మరసమొ

తనమానికము వడ్డ ♦ వనట కోపక మిన్న
కన్నె గుప్పెడికెంపు ♦ కంటిమేలుపో
తే॥ గీ॥ యనఁగ ముగితిని గని తమ్మి ♦ యనుఁగుమగఁడు
రోషకాషాయభూషిత ♦ వేషుఁ డగుచు
తెట్టె గట్టినచీఁకట్ల ♦ మట్టుపెట్ట
మోదకరమయ్యె నాఁటి సూ ♦ ర్యోదయంబు॥
ఇట్లుండ మునుపు సంభవించిన దురవస్థలు తీరిపోయి
తే॥ గీ॥ అరుణుఁ డరదంబు నెక్కి ని ♦ ల్లాలు లేచె
వడుగులకు జోస్యులకు గుండె ♦ యడలు వాసె
తుమ్మెదలు రేగెఁ దమ్మిలు ♦ తూఁగియాడె
జక్కవలచిక్కుదీరెఁ జే ♦ జాతె విప్రి
పాతిరర్ఘ్యప్రదాన మీ ♦ పగిది లోక
జాల మెల్ల బ్రిహ్మానంద ♦ లీలఁదేలె.
ఇట్లు లోకానందదాయకుం డగు హనుమంతుండు.
మంజరి॥ అనితరమగు తేజమునఁ దన ప్రితా
పాంకురముఁ జూపించెఁ
అఖిలదేవతాగణముల మహితా
నందవార్ధి నాడించెఁ.
సాధో! రే! ఋషిణః సాధో! రే ఋషిణః
రామదూతచరితం రసభరితం
అతిదూరీకృతదురితం భక్తప
రాచ్యుతాచలానందమధురితం॥ సాధో! రే!
తృతీయాధ్యాయము
ప్రితాపాంకురము
సమాప్తము.

శ్రీ

# బాలాంజనేయము

## చతుర్థాధ్యాయము

## వరప్రాప్తి.

ఇట్లు హనుమద్గర్భకుహరమునుండి విముక్తింగని కర్మసాక్షి యగు సూర్యభగవానుండు ప్రభంజనాత్మజు నుద్దేశించి.

మంజరి॥ మర్కటవీరుని చేత ముక్తి యిటు
మనకబ్బెంగదా యనుచున్
మహితానందముచే రవి వాయుకు
మారుని దయతోఁ గనుచున్.

కపివరునకు వరమిచ్చు తలంపు హెచ్చ వానిం డాయవచ్చి.

తే॥ గీ॥ సూర్యుఁ డానందమునఁ గపిఁ ♦ జూచి పల్కె
"వానరా! కోరికొను మిష్ట ♦ వర మెదేని"
అంత సంతస మంతంత ♦ దొంతరింప
మరలివచ్చెద నని చెప్పి ♦ తరలిపోయె.

ఇచ్చట నిటుండ నక్కడ మహేంద్రుఁడు తనకు సంభవించిన పరాభవముం దలఁచికొని యుమ్మలికముఁ దప్పించుకొని పొగిలిపొగిలి లోలో నిటుని వితర్కింపందొడంగె.

తే॥ గీ॥ కొండలం బిండిపిండిగఁ ♦ గొట్టికొట్టి
మొక్కపోవుట లెఱుఁగని ♦ యుక్కుముక్క
నాదు వజ్రాయుధం బోడు ♦ నా యటంచు
రోషమున నాకపతి సందు ♦ రోయుచుండె.

ఇట్లు చల్లారనిపరాభవాగ్ని తన్నలమికొని చీకాకొనరింపఁ గపివోక మహాక్రోధముతో.

మంజరి॥ తనివి సనక యింద్రుం డలమారుతి
దమనము మదిఁ దలపోసెన్
తనకులిశముతో నంజనకొమరుని
దవడలు బగులఁగ నేసెన్.

ఆంజనేయుం డేమరుపాటున నాటలాడుకొనుచుండఁ గులిశం బిట్లు బాలుని దాఁకిన వెంటనే.

ఉ॥ ఆకులిశాహతిన్ గపికు
లాగ్రణి లేఁజిబుకంబు లెంతొ చీ
కాకయి రక్తముల్ దొరఁగఁ
గన్నులు మూఁతలు వైచి చిత్తమం
దాకులపాటుఁగూరి తను
వందు స్పృహం బెడఁబాసి సోలె నా
భీకరవాతఘాతమున
ఘెళ్ళునఁగూలెడు మ్రానుకైవడిన్.

ఈసమాచారము సర్వవ్యాపకుండగు వాయుదేవుండు చూచి క్రోధము నిరోధింపంజాలక మండిపడుచు నిందద్రిదిగ్భాగంబున నిప్పు లురల వీచుచు.

కీర్తన

మదమా! తన కులిశము నిటువిసరఁగ
మాబాలుని మూర్ఛపుచ్చి
బ్రితుకఁగలఁడే యింద్రుకింత॥ మదమా॥

బ్రహ్మాండంబుల కెల్లను
ప్రాణము నేనని యెఱుఁగఁడొ
బ్రహ్మాదుల కలవిగాని
వ్యాపకత్వమ్ముఁ దలఁపఁడో
తగునంచుఁ సుతు నొంచెఁ
ఎగసి కనుల కెగఁదట్టిన ॥మదమా॥
ముజ్జగాల గాలి ముడిచి ముంచి యంత మొందింతుఁ
ఇజ్జనముల ప్రాణవాయు వింతటితో బంధింతుఁ
లోకాలఁ బోకార్తుఁ - ఇదిగో జగము లాపివైతు
నిందురినకుఁ గనుఁగానని॥ మదమా॥

అని ప్రతిజ్ఞఁగావించి సుతుండు మూర్ఛనుండి లేచుటకు సదుపాయ మిదియే యని నిశ్చయించుకొని వాయువుల నిర్బంధించివైచిన వెంటనే లోకంబులన్నియుఁ జిందఱవందలై యూర్పుఁగొను నేర్పులేక పెద్దనిద్దురఁ బోనుండె నెట్లనిన.

సీ॥ తరువు లానాఁడు సం ♦ స్తంభితశాఖలై
చిత్రార్పితక్రియఁ ♦ జెన్నుఁదొరఁగ
మానవుల్ నిశ్వాస ♦ హీనులై ధరఁగూల
నింటింటఁ బీనుఁగు ♦ పెంటలయ్యె
గాలిచేఁ గదలక ♦ చాలువాఱఁగ లేక
సెలయేళ్లు పారక ♦ నిలువఁబడియె
చీఁకటిలో నిద్రఁ ♦ జెందుచుండెడి క్రూర
జీవసంఘములు ని ♦ శ్చేష్టమయ్యె

తే॥ గీ॥ ప్రళయకాల మాసన్నమై ♦ పరఁగెననఁగ
వికలనిర్జీవసాలభం ♦ జికలకట్లు
చీకుఁదెవ్వులంటి మధ్యము ♦ లోకమెల్ల
రాణఁబెడఁబాసి దీర్ఘని ♦ ద్రాణమయ్యె.

ఈదుస్థితి ప్రళయకాలలక్షణ లక్షితంబై కనుపట్టినఁ ద్రిమూర్తులు మహేంద్రుఁడు సర్వసుపర్వులు బెగడొంది

మంజరి॥ అంతఁ ద్రిమూర్తులు భయవిహ్వలతా
భ్రాంతిమనంబులఁ గూరక
సంతాపముఁ దీర్చుకొనుటకుఁ గరువలి
చెంత కిందుర్గొనిపారక

ఇట్లు వారలందఱుఁ గరువలిం డాసి స్వామీ! వాయువుల బంధిం చితి రేమి? జగంబు లస్తమింపఁ బోవుచున్నవి. ఇంతసాహసము సంకల్పించి

కీర్తన.

ఇటుధర్మము మీర సమీర!
ఇది తగునా? ధీర! ॥ఇటు॥
పటుతరముఖ్యప్రాణాధారుఁడవు
తటుకునఁ గోపానఁ
దగిలి జగము లాపివేయ॥ ఇటు॥

స్వామీ! కోపకారణ మేదో సెలవిమ్మని ప్రార్థించిన వాయుదేవుఁ డంతట వారలతో నిట్లనియెను.

ఉ॥ “ఈసునఁ దొల్త నీతఁడు మ
హేంద్రుఁడు వజ్రము నేయ బిడ్డఁడా
యాసము నెంది రోమమున
నయ్యది రాల్చుడు నేతి నగ్గిలోఁ

చోసినరీతి మండి కసి
పోవక తా మసిఁ బూసికొన్నటుల్
నాసుతుఁ గూలనేయఁ దగు
నా పగ నాపఁగ నా కశక్యమా?

ఇంద్రియంత్రమాత్రము నాకేమి చేతఁగాదో యని దానికిం దగిన ప్రతీకారముం గావింపఁ దలంపు హెచ్చిన నాయథాశక్తి.

మంజరి॥ దానం జేసి మదీయసమర్థత
తో నిటు జగములఁ గట్టి
బూనుచు ముఖ్యప్రాణవాయువులు
పొదలకుండ బిగఁబట్టి.

నిశ్చయించి యిట్లు కావించితి" నని వాయుదేవుండు బదులియ్యఁ బ్రిమూర్తులు.

కీర్తన.

పాహి పాహి వాయుదేవ!
భావితకరుణాస్వభావ!
సకలజగత్సంచారా!
సారగుణాధార! ధీర! ॥పాహి॥

మీఁ పరతత్వము నెఱుఁగక
సాపరాధి యయ్యె నితఁడు
కోపము నుపసంహరింపవె
కొడుకుకు మూర్ఛ బాపెద ॥పాహి॥

ఇట్లు కపికుమారుఁడు మూర్ఛనుండి లేచినవెంటనే సర్వజగంబులు నిద్దురనుండి లేచెను.

మంజరి॥ కపివరుఁ డంతట మూర్ఛఁదేరి మే
ల్కని నడయాడఁ దొడంగెన్
కదలుచు సర్వజగంబులు ప్రాణము
కుదురుపడఁగ మదిఁ బొంగెన్.

సాధో! రే శుభ్రిణు సాధో! రే శుభ్రిణు!
రామదూతచరితం రసభరితం
అతిదూరీకృతదురితం భక్తవ
రాచ్యుతాచలానందమధురితం॥

ఇట్లు వాయుదేవుని సంతృప్తుంజేసి బాలుని మూర్ఛనుండి మేలుకొల్పి ముజ్జగంబులకుఁ బ్రాణప్రతిష్ఠఁ గావించి యాడుకొనుచున్న కపికిశోరమును డాయంజని మహేంద్రుఁడు వినయవినమితోత్తమాంగుండై యిట్లని సన్నుతించె.

కీర్తన.

మము క్షమింపు మంజనాకు
మారా! సుకుమార! ధీర! ॥మము॥
సర్వదేవతాసారా! శాత్రవసంహారణశూర!
దానవసంహారా! శం ధామచరిత! రసభరితా!
శూరకులాలంకారా! సురుచిరభక్తమందారా! ॥మము॥

ఇట్లు మహేంద్రుఁడు సన్నుతించినపిమ్మటఁ ద్రిమూర్తులు కపికుమారు ననుగ్రహింపఁగోరి.

మంజరి॥ అని వినుతించి సమస్తవరంబుల
ననిలకుమారుఁడు వొంగెన్
గొనకొని పద్మజహరిహరు లతనికిఁ
గొసరికొసరియు నొసంగెన్.

హనుమంతుం డపారబలసంపన్నుండై తేజరిల్లెను. వార లిచ్చిన వరంబు లెవ్వియన.

సీ॥ అఖిలలోకంబుల ♦ కంట శక్యముగాని
యపరిమితమ్యత నిచ్చె ♦ నబ్జభవుండు
అఘటనఘటనామ ♦ హత్వంబు సాటిలే
నట్టిది సమకూర్చె ♦ నాదివిష్ణుం
డలతిలేనట్టి శౌ ♦ ర్యస్ఫూర్తిం దులందూంగు
మనుచు దీవించెం జం ♦ ద్రాభరణుండు
అణిమాదిసంసిద్ధు ♦ లంది నీ కెనలేక
తనరారు మనె దేవ ♦ తావిభుండు
తే॥ గీ॥ అఖిలదేవతల్ తమయందు ♦ నలరునట్టి
ప్రతిభ లొసంగి రక్కసుల డీ ♦ ల్పఱచు మేటి
వీరుండవు కమ్మటంచు దీ ♦ వించి చనిరి
కపిసుతుం డనన్యబలవీర్య ♦ కలితుండయ్యె.

ఇట్లు వరంబులం గురిపించి తరువాత శ్రీయంజనాకుమారుండు ప్రసన్నుండై యుండుట నరసి బ్రహ్మదేవుండు తా నొక్క ప్రతిఫలము నాతనియొద్దనుండి యాసించుచు.

మంజరి॥ బ్రహ్మాస్త్రము తునుకలగుట కోర్వక
పరిహారముం దలపోసెన్
బ్రహ్మదేవుం డలమారుతిం గన్గొని
ప్రస్తుతించుటకు డాసెన్.

డాసి చేతులు జోడించి.

కీర్తన.

పరమాత్మా! మాం పాలయ కరుణాలయా!
హరిహరపద్మజసుర తేజోనిలయా! ॥ పర॥

నీవు హరిహరరూపుఁడవు
రమణీయరుచిరపవిత్రాపుఁడవు
శ్రీదేవదేవ! దయానిధే!
మముఁగావఁ బుట్టినపుణ్యమూర్తివి॥ పర॥

రామచంద్రునిబంటు వగుచు ధ
రాకుమారీవార్తఁ దెత్తువు
శ్రీమహితలక్ష్మణకుమారుని
జీవమగు సంజీవి నిత్తువు॥ పర॥

అని యిట్లు సంస్తుతించి మారుతిం బ్రసన్నుం జేసికొని ఓస్వామీ! నాచిన్నమనవి నాలకింపవలయును.

శా॥ మాయజ్ఞానము మిమ్ము గుర్తెఱుఁగ కి
మ్మాడ్కిన్ రచింపించె న్సు
మ్మా! మెల్లని ననుగ్రహింపఁదగు బ్ర
హ్మాస్త్రావమానం బిటుల్
సేయంగాఁ జనదట్లు గాన క్షణమా
సేపైన నీమేలు కై
నాయస్త్రంబున కోడి కట్టువడుచున్
నాకోర్కె లీడేర్పవే.

అని వేడుకొనుచున్న బ్రహ్మదేవునియందు దయార్ద్రచిత్తుండై వాని వంకఁ జూచి యిట్లనెఁ బ్రభంజనాత్మజుండు.

మంజరి॥ ఓకమలాసన! నీకోరిక నే
నోడఁగూర్చెద ముదమందర్
నా కవసర మగునపు డాయస్త్రము
చేఁ గట్టంబడి యుందుర్.

సాధో! రే! శ్రీను! సాధో! రే! శ్రీను.
రామదూతచరితం రసభరితం
అతిదూరీకృతదురితం భక్తవ
రాచ్యుతాచలానందమధురితం.

చతుర్థాధ్యాయము
వరప్రాప్తి
సమాప్తము.



శ్రీ

# బాలాంజనేయము

పంచమాధ్యాయము.

## కల్యాణము.

ఇట్లుండ నంతకుమునుపే వాయుకుమారుఁడు తనకు విద్యాభ్యాసమున కదనువచ్చుట నెఱింగి.

మంజరి॥ అంతట విద్యాభ్యాసయోగ్యకా
లంబరుదెంచుట చూపట్టెన్
సంతసమున మును వర మొసఁగిన రవి
సన్నిధి కేగం దలపెట్టెన్.

ఇట్లు విద్యాభిలాష మనమునం దినుమడింపఁ జనిచని.

కీర్తన

కపిసుతుఁ డటుబ్రహ్మాస్త్రముచేఁ గ
ట్టువడుటకుం దానొప్పికొనుచు నం
తఁబతంగుం డాయంజని పలికెను
సుపర్వవందిత ! నమో నమస్తే
సాంగోపాంగము లగు వేదములును
సకలశాస్త్రములు సర్వాగమములు
స్వామి ! నాకు నేర్పుమనుచు వేడిన
నామహాత్మునకు భాస్కరుఁ డిట్లనె

భజ రామదూతచరితం
భజ నవరసభరితం ॥భజ॥

ఇట్లు మారుతి తన్ను డాయవచ్చి విద్యల నిప్పింపుమని కోరిన భాస్కరుండు దా నొసంగినవరమును మదిలోఁ దలంచి.

మంజరి॥ విద్దెఁగోరి తనయొద్దకు వచ్చిన
విపరీతకిశోరంబుగ్.
గద్దింపక సూర్యం డిట్లనె మదిఁ
గట్టుక పూర్వవరంబుగ్.

అంతట భాస్కరుండు సామీరిం జేరఁదీసి బుజ్జగించి.

శా॥ ఏమీ? శ్రీహరియాజ్ఞతో నభమునం
దే సర్వకాలంబు నే
నీమైఁ దిమ్మరిఁబోలి పర్వులిడుచుం
టిగ్ గాదె, నాయొద్ద నీ
వేమాడ్కిగ్ జదువంగలాఁడ, విదియా
నే; స్వల్పకార్యంబె? యో
సామీరీ! భవదీయయత్నము మహా
శ్చర్యంబుగాఁ దోఁచదే?

అని మారువల్కిన సూర్యంగని మారుతి మరలఁ బ్రితిమాలుకొనఁ దలంచి.

మంజరి॥ అనుమాటలు విని మారుతి దరహా
సాంకురములు తలలెత్తగ్
ఇనుఁడు గనగ్ సదుపాయముఁ దెలుపఁగ
నెదలో ముద మిగురొత్తగ్.

సూర్యునిముందు మోఁకాలిపై నిలువంబడి కడుంగడు వినయవినత మూర్తితోఁ జేతులు నిటలతటంబున దోసిలించి.

కీర్తన.

గురువర్య ! సులభముగాదే ! మీ
గురుకటాక్ష మొనఁగూరినచో॥ గురు॥
మూఁగవాఁ డుపన్యాస మొనర్చుఁ
గుంటివాఁడు కొండలపై కెక్కుఁ
అఘటనఘటనాపటిష్ఠమగు గురు
కటాక్ష మెంతకుఁ జాలదు స॥ ద్గురు॥
సారకృపాసముదారగురుకటా
క్షారభటిఁ సమకూరు సమస్తము
కోరిక తీరెడుతీరే దొరకదో
పారఁజూతు నొకదారి జగ॥ ద్గురు॥

ఇట్లేదేని సదుపాయముం గల్పించి తనశక్తిబలప్రాబల్యముల గురువులకు స్పష్టీకరించి ఛాత్రయోగ్యతాపరీక్షయం దుత్తీర్ణుండు గాఁదలంచి

కీర్తన.

ఒకపాదం బుదయాచలమున వే
ఱొకపాదము పడమటిగిరిపైనఁ
బ్రకటాశ్చర్యముగా మోపి నిలిచి
సకలకర్మసాక్షిఁ బ్రార్థించెఁ
కపివరుబుద్ధిబలప్రభావములఁ
గని దినకరుఁ డెంతో సంతసిలుచు

నపరిమితంబగు దయారసముతో
నన్నిశాస్త్రములఁ దా బోధించెళ్
భజ రామదూతచరితం
భజ నవరసభరితం ॥భజ॥

ఇట్లు వాతాత్మజునిబుద్ధివిభవముల కెంతయు సంతసిలుచు విద్దెలం
జెప్పుచుండ నానాఁటికి.

చ॥ కపివరుఁ డన్నిశాస్త్రముల
గట్టిగ నేర్చి యఖండశేముషీ
వ్యపగతమోహుఁడౌటఁ గని
భాస్కరుఁ డెంతయు మెచ్చి వానికిళ్
విపులముగా శుభంబు లొదవింప
సువర్చల కీతఁ డెంతో మంచి
పతి యటంచుఁ జిత్తమునఁ
జేర్చె మనోరథ మద్భుతంబుగళ్.

అని యిట్లు తనయాత్మలోఁ గోరికలీరికలెత్త నొక్కనాఁడు నిజాం
తరంగంబున నిట్లని రవి వితర్కింపఁదొడంగె.

కీర్తన.

ఏమిభాగ్య మింతవాని
కేను గురుఁడనైతి నహహా! ॥ ఏమి॥
ఈమహాత్ముఁ డఖిలవిభవ
ధాముఁడు శౌర్యాభిరాముఁ ॥డేమి॥

ఈమహనీయుని శుశ్రూషామహిమ లపారంబులు
ధీమహితాత్ముం డాత్మారామానందుఁడుఁ బూర్ణుఁడు
భామసువర్చల కీతఁడు పతి యగుటకుఁ దగినవాఁడు
నాముద్దులబిడ్డ నిచ్చి జామాతగఁ జేసికొందు॥ నేమి॥

అంతటఁ బదినాళ్లకు విద్యాపరిపూర్తిఁ గావించుకొని యింటికేగుటకు గురునాజ్ఞంగోరి.

మంజరి॥ విద్దెలు నేరిచి కపిబాలుఁడు సెల
విమ్మని యడుగఁగ జనియెన్
ముద్దులశిష్యునిఁ జేరఁబిలిచి రవి
మోదముతో నిట్లనియెన్.

ఇట్లు రాఁదీసి బుజ్జగించి కపివర్యునుద్దేశించి తనకోర్కెలు వెల్లడిపఱుపింపఁగోరి రవి యిట్లని చెప్పందొడంగెను.

కీర్తన.

ఎక్కడికిఁబోయెదవోయి కపిబాల !
చక్కఁగ నాగురుదక్షిణ సమర్పింపకుండఁగ నీ॥ వెక్కడికి॥

అనుమాట లాలించి గురునమస్కారముం గావించి మారుతి యిట్లని ప్రార్థించెను.

స్వామీ ! మీ కిష్టమేదో సెలవియ్య
రమ్ము మా॥స్వామి॥

1. మామకఋణమును దీరిచి మ
* ద్గృహమ్ముఁ జేరనిమ్ము ॥స్వామి॥
2. మామ ! కరుణ మును దీరిచి
* మద్గృహమ్ముఁ జేరనిమ్ము ॥స్వామీ॥

* (గృహిణీ గృహ ముచ్యతే) గృహం = భార్య.

1. నాసంబంధమైన గురుదక్షిణారూపమగుఋణముం దీరిచి మాయింటికిఁ బోనిమ్మని యొకయర్థము.

2. ఓమామగారూ! మున్ముందు దయచేసి నాభార్యతో ననుఁ జేరనిమ్మని రెండవయర్థము.

అనిప్రార్థించెడి కపిబాలునివంకఁ జిఱునగవుతోఁ గటాక్షము నింపి శిష్యాగ్రణీ !నా కోరఁబోవు గురుదక్షిణ నీనోటనే వెలువడినది దాని వినుము.

శా॥ ఈ మీమాటలె తెల్పు నాయభిమతం
బింకేమి ? మీ నోటనే
నేమార్గ, గురుదక్షిణాక్రమము ము
న్నే తీరెఁ బో, మీరు మా
జామాతల్ సుమి !, మత్తనూరుచిరతే
జస్సారసంజాతక
న్యామాణిక్య సువర్చలామణి వివా
హంబాడవే! ధీమణీ॥

అని భాస్కరుండు కోరిన నేవిధమైన బదులిచ్చుటకు వలనుపడక.

తే॥గీ॥ గురునికిన్ దక్షిణాలు సమ ♦ కూర్చవలయు
భాస్కరమనోరథముఁ దీర్ప ♦ వలనుపడదు
పడఁతిఁ బెండ్లాడుటొప్పిన ♦ బ్రహ్మచర్య
భంగమని కపిముఖకాంతి ♦ రంగు మాఱె.

ఇట్లు తెల్లవోయిన మోమువానిని మారుతిఁ జూచి సూర్యుండు

మంజరి॥ అనఁ దలవంచుచు నాలోచించెడి
యనిలసుతుఁడు మది నుల్కన్

ఘనకరుణాదృక్కులఁ బఱపుచు నా
కమాలాబంధుఁడు పల్కెన్.

ఆంజనేయునియందుఁ బొడమినసంశయము నివర్తింపఁదలంచి

కీర్తన.

భయము వలదు సుగుణా! నతచరణా! భవతరణా!
నామాట వినుము జగత్కారణ! కపికులాభరణ! ॥భ॥
భవద్ధర్మసహచారిణి భానుభానవీరూపిణి
పరాశక్తిఁ బెండ్లాడిన బ్రహ్మచర్య హానియ నెడు॥భయ॥

అని యిట్లొడంబఱిచి మారుతిఁ ననుమతిం గైకొని వివాహసన్నాహముం గావించి వధూవరులపాణిగ్రహణ మహోత్సవంబును మహోత్సాహంబుతో జరిపించి యల్లునికి విద్యాదానముతోఁబాటుగఁ గన్యాదానముం గావించి మార్తాండుం డమందానందమునందుఁ దేలెను.

## కళ్యాణ కీర్తన.

ఔర! జరిగె శ్రీసువర్చలాంజనేయకళ్యాణము
సర్వజగత్కళ్యాణము రాగభూరికళ్యాణము. ॥ఔర॥
సూర్యమండలమునఁ గల్గు శుభగ్రహములు విచ్చేసిరి
సురగణములు మింటి నుండి సుమవర్షముఁ గురిపించిరి
సర్వజగత్కళ్యాణము। రాగభూరికళ్యాణము।
భక్తకోటికళ్యాణము। పరాశక్తికళ్యాణము॥ఔర॥
ఛాయారోహిణుల కపుడు సాయపడుచుఁ బేరంటము
సేయుచు వారాంగనల వలె జిగిఁ గుల్కిరి తారాంగనలు

సర్వజగత్కళ్యాణము। రాగభూరి కళ్యాణము।
భక్తకోటికళ్యాణము। పరాశక్తి కళ్యాణము॥ జౌర॥
ఈకళ్యాణము వ్రాసినం జేకొని చదివిన వినినన్
శ్రీకరుండు సువర్చలాపతి ప్రకటకరుణన్ బ్రోచున్
అఖిలజగత్కళ్యాణము అచలభక్త కళ్యాణము
అచ్యుతాంశకళ్యాణము ఆనందద కళ్యాణము॥ జౌర॥

ఇట్లు కళ్యాణము నిర్వర్తించినట్లు మైత్రేయుండు కోరినప్రకారము పరాశరుండు వర్ణించెనుగాన నోభక్తులారా!!

మంజరి॥ ఈవిధి మారుతికళ్యాణము విని
యిష్టసిద్ధినిం గనుండీ
భావమునం దాంజనేయుం గొల్చుచు
భద్రము లందికొనుండీ॥

సాధో! రే శృణు సాధో! రే శృణు
రామదూతచరితం రసభరితం
అతిదూరీకృతదురితం భక్తవ
రాచ్యుతాచలానందమధురితం

భక్తనమస్కారము.

శ్లో॥ శ్రీమూర్తిత్రయదీప్తి భాజనరసాం
చిన్మాత్రతేజోమయీాం
భక్తత్రాణపరాయణైకచరితాం
దాక్షిణ్యమూర్త్యాత్మకాం
శశ్వద్భాగవతాన్నపూర్ణవిభవాం
దీవ్యత్తైనాలీపురీ

శ్రీమత్పంచముఖాంజనేయకరుణాం
వందే సదా మోక్షదాం.

సీ॥ శ్రీహరిహరవిరిం • చిప్రిభాజాలంబు
ముమ్మెల గుట్టగా • మొసరుతావు
సచ్చిదానందప్రి • శస్త్రదీధితులచే
నిండి నింగిని గెంట • నేర్చుతావు
నిజభక్తరక్షైక • నిష్ఠాగరిష్ఠమౌ
మహిమ లొక్కెడఁగూడి • మనెడితావు
దాక్షిణ్యమాహాత్మ్య • తను గాంచి పెనుపొందు
పావనతల కునికి • పట్టుతావు

తే॥గీ॥ పరమ భాగవతాన్నపూ • ర్ణరస మగుచు
శ్రీతెనాలీపురంబునఁ • జిల్గులీను
నట్టి పంచముఖాంజనే • యకరుణాప్తి
మోక్షమొసఁగుచు మమ్మేలఁ • బోచ్చుఁగాత !

మంగళాచరణము.

నీపాదనీరజములకు నిత్యజయమంగళం॥
ఆంజనేయా! అమరగేయ! అచ్యుతాచలాప్రమేయ!
నీపాదనీరజములకు నిత్యజయమంగళం ॥నీపాద॥
పరమాత్మా! పరంధామ! పరంజ్యోతిరూపమైన
నీపాదనీరజములకు నిత్యజయమంగళం॥నీపాద॥

## కీర్తన శ్లోకములు

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు॥

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి
శ్రీరామదూతం శరణం ప్రపద్యే.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# కవిప్రార్థన

---

శా॥ సామర్థ్యం బెటులున్నఁ దప్పటడుగుల్
సాగించుచుఁ బిడ్డ పె
ప్పే మెమ్మె యని తొక్కుఁ గూతలను జ
ల్పింపఁ ముదం బెచ్చి యెం
తో ముద్దుల్ గొను తండ్రిఁ బోలి నెరసుల్
ద్రోయించి మీ సత్కృతిఁ

శ్రీమత్పంచముఖాంజనేయ! పరిపో
షింపన్ దలంపూనిన
ట్లే మీాయచ్యుత వేంకటాచలపతిన్
వీక్షించి రక్షింపవే!

ఉ॥ వారిధిఁ గట్టనేర్తునని
వచ్చెనె రామపదాంబుజాతసం
పేరితభక్తితో నుడుత
పిల్ల? స్వశక్తులఁ బొర్లిపొర్లి సే
తారమణాదరానఁ జరి
తార్థతఁగాంచదె యట్టులేను నా
నేరిచినంతవట్టుకు మ
నీషను జూపుచు మీా కథాసుధా
ధారలఁ గ్రోలితిన్ ననుఁ గృ
తార్థునిసేయవె! వాయునందనా!

శ్రీ సువర్చలాంజనేయపరబ్రహ్మార్పణ మస్తు.

ఓమ్ తత్సత్.

శ్రీ శ్రీ శ్రీ





ఓమ్

# కవిమనవి

—o—

ఉ॥ ఓవిబుధేశులార ! మహి

మోన్నతులార ! మదీయసత్కృతిన్

భావముఁ దన్వుతావుల స్వ

భావముదంబు గడించి, కైతలం

దే వగ బారు తప్పినను

దేవఁగఁబాలిక, కల్గినంతలో

మేవడియైనకొద్దిరస

మే వడిఁ గైకొనరయ్య! మ్రొక్కెదన్.

ఇట్లు,

అచ్యుతుని వేంకటాచలపతిరావు,

గ్రంథకర్త.

శ్రీ పంచముఖ వీరాంజనేయ పరబ్రహ్మణే నమః

# బాలాంజనేయము

## అధ్యాత్మ కీర్తనావళి

### సువర్చలోదయము

శ్రీమారుతివరమంత్రము । శ్రీదము కలిహర మంటిరి । ఆమహాత్ముం డేమిచేసెనో । యతనిచరిత మెఱుఁగఁ దెలుపవే, । యనుచు మైత్రే । యుండు కోరిన । హర్షపరిపూ । ర్ణాత్ముండై శ్రీ । ముని పరాశరుఁ । డపుడు హనుమం । తుని చరితము । పఠింపసాఁగెను ॥ శ్రీమారుతి ॥

2. విశ్వకర్మకుఁ బ్రియతనూజను । వినుతగుణగణకల్ప భూజను । ఛాయ యను కాంతాలలామను । జండకిరణుఁడు పెండ్లియాడెను । ఆరమణి తన । పతిసమీపముఁ । జేరఁజాలక । మోహతాపముఁ । గూరి తల్లిని । డాయఁజని తన । కోర్కెల విని । పింపఁదొడఁగెను ॥ శ్రీమారుతి ॥

3. జననీ! నాపతివేడి కోర్వక । వనటచేఁ గుందుచుంటిఁ । తనదు భర్తకుఁగానిచక్కం । దనము వనితల కేల? తల్లీ! । కాన మీయ । ల్లునికిఁ దేజముఁ । గరము డించెడి । దారి చూడుము । లేనిచో నా । జీవితంబును । బూనుకొని ని । ష్ఫలం బనియెను ॥ శ్రీమారుతి ॥

4. ఏలచింతిలనేల తల్లీ! । బాలరవి నీతండ్రి తా । లీలఁగై కొని సానఁబెట్టుచుఁ । గూలఁద్రోయును దీక్ష్ణతఁ । అనుచు సూర్యుని । సానపై నిడి । యరగఁదీసిన । కతన రవి రా । పిడుల పొడిలో । నుండి యప్పుడె । పడఁతి పుట్టె । సువర్చలా యన ॥ శ్రీ ॥

5. దేవతలు వాణీశు నడిగిరి। దేవ ! యీరవిపుత్రిక। కేవ రుఁడు రాఁగలఁడో మా కిపు। డెఱుఁగఁ జెప్పు మటన్న నిట్లనె। మింటిసూర్యుని। దొండపండని। పంటఁ గొఱికెడి। వాఁడు రాముని। బంటు హనుమ। ద్వీరుఁ డీమెకు। భర్తయగు నని। బదులొసంగెను ॥ శ్రీమారుతి॥

6. క్రూరులగు రాక్షసులు పెట్టెడి। ఘోరయాతన లెల్లఁ దా। మోరువక సుర లజుని శంకరుఁ। దారు మున్నిడుచుఁ బోయి భూరి వైకుంఠపతియొద్దకుఁ। జేరి శ్రీపతి ! । దైత్యసం। హారమునఁ జా। లెడిమహాబలు। వీరవరు దయ। సేయు మనిరఁట ॥శ్రీమారుతి॥

7. హరున కొసఁగెను శౌరి సకలే। శ్వరుల తేజఃపిండము। నిరతభక్తిపరాయణుఁడు వా। నరమహాబలుఁ డిందుఁగలఁడని యట్టి మర్కట। శూరుఁ డసురుల। ముట్టి పీచ మ। డంచి లంకఁ। గొట్టి తగులం। బెట్టి జనకుని। పట్టి కంగుళి। నియ్యఁగలఁడనె ॥శ్రీ॥

8. రామకార్యధురంధరా నిజ। ధామజిత దశకంధరా ! సర్వశత్రువశంకరా నిజ। చరణనతజనశంకరా ! కోటిసూర్య స। మాన తేజా। కపివరేణ్య। దయావిరాజా ! వేంకటాచల। పతి హృదంతర। విహితపావనపదసరోజా ॥శ్రీమారుతి॥

అంజనాత్మజము

మారుతిచరిత సుధారసపానము। మానకవే మనసా। బ్రహ్మానంద। సారమదే మనసా ! — త్రాల్చవే శిరసా — శ్రీశంకరుఁడు గౌరి। చేఁజేయిఁ గీలించి। వాసితో నుద్యాన। వన విహారముచేయ। భాసురంబగు। వేంకటాచల। పర్వతంపుని। కుంజభూమివి। లాసములఁగరఁగుచు రమించెడి। రమ్యకపిదం। పతులఁ గాంచెను ॥ మారుతి ॥

**2.** శ్రీగౌరి తనభర్తఁ । జేరి యిట్లనిపలికె నాథా! వానర మిథునము లేగతిఁ గ్రీడ । సాధించెనో కనుము తద్గతి నంద । వేధించె నామనము — నాముచ్చటను — మీరు తీర్పక యున్న నోరువఁజాలన । పారకృపాకర ! పరమేశ్వర ! రమ్మా । ఈవిధము తనయువతి పలికిన । భావమును గుర్తెఱిగి శంకర । దేవుఁ డాకమగకోఁతియై గౌరీవనితఁ గపికాంతఁ జేసెను॥మా॥

**3.** వారలిద్దఱు వేయివత్సరంబులు నిట్లు । మారకేళిలోఁ దేలిన శివశంకరుఁడు । గౌరిగర్భమునందున దైవతప్రతిభా । సార మాత్మతేజము స్థాపించిన ।నారమణి సహియింపక యగ్నికి నియ్య । నాతఁడుఁ దానోర్వక — పవనున కిచ్చె — గాలికిఁ దనచేత రాలుపండ్లను దినుచు । ఘనమైనదీక్షతో వనదుర్గ ములయందుఁ । బరమసాధ్వీతిలక కేసరిభార్య యంజనదేవి తన యుని । వరమహాబలవంతుఁ గోరుచు నిరతతీవ్రతపంబు సలి పెను ॥ మారుతి ॥

**4.** ఆ తీవ్రతపమున కంతరంగమునందు । నమితసంతస మొందుచు । బవనుఁడు శివుని । యద్భుతతేజంబును గైకొని వచ్చి యంజన యఱచేతను — పడవైచిన — ఆమె దానిని పండుగా మదిని భావించి ప్రేమతో మ్రింగి మహామోదమును గాంచెఁ। గామినీమణి కంజనాసతి కప్పుడప్పుడె గర్భమయ్యెను। భామ తనదువ్రతంబునకు పెనుభంగమయ్యెనటంచు వగచెను॥

5 ఈరీతి బలువగలఁగూరినకాంత కిశ । రీరవాణి పలికెను. ఓ ! తల్లీ! నీ । నేరములే దింకను । మహావ్యక్తి । సారదైవత తేజము । నీగర్భమం । దారూఢిఁగలఁడనెను – దానిని విని – సారప్రమోదప్రసారసంపూర్ణవిస్తార హృదయపంకేరుహామెఁ బడసెఁ । తనర వైశాఖబహుళంబున దశమి నభిజిత్ శని

దినంబున । మానినీమణిగర్భమున హనుమంతుఁడనువీరుఁడు జనించెను ॥ మారుతి ॥

6. ప్రబలమహాత్ముఁడు ప్రఖ్యాతవైష్ణవ భక్తిపరాయణుఁడు । త్రిమూర్తిసంభావ్యతేజోమయుఁడు । సమస్తసుపర్వ ప్రభాయుతుఁడు । మాణిక్యకుండలకాంతిశోభితుఁడు । కనకాంగదహేమమాలాధరుఁడు । మహాభుజుఁడు భీమబలాన్వితుఁడు — కేసరిసుతుఁడు — పుట్టఁజందెమువాఁడు । పుట్టగోచిగలవాఁడు । దిట్టమైవజ్రమును గొట్టుశక్తిగలాఁడు। దీర్ఘకాయుండు మహాహనుఁడుద్దీప్తలాంగూలుండు వీరుఁడు దేవి యంజనముద్దుబిడ్డఁడు తేజరిల్లె మహాద్భుతంబుగ ॥ మారుతి ॥

7. అఖిలశుభలక్షణుం డంజనాకపిసుతుం । డావిర్భవించుతఱిం బుష్పవాన । లమరులు గురిపించిరి దుందుభిభేరీ । స్వనములు మ్రోగించిరి । గంధర్వ కిన్నరులు నాట్యము సలిపిరి — నుతిచేసిరి — తరువులు పుష్పఫల । భరితములయ్యెను సరసముగఁబాడె మధుకరదంపతులబారు । కర మసురమస్తకకిరీటవికాసమణు లొకపెట్ట డుల్లెఁ గరువలికి సుతుఁ డుదయమగుటఁ గమ్మకమ్మంగ వీవఁదొడఁగెఁ ॥ మారుతి ॥

8. అటమీఁద బాలుని కైదుదినములు రాఁగ । నమవసచనుదెంచెను బిడ్డఁడు తల్లి।నరసి యిట్లని వేడెను. అమ్మా! నేను। నమితముగ నాకొంటినే । గుజ్జనగూండ్ల నారగింపఁగఁబెట్టవే — యని యేడ్చినఁ — దనయా । నాయొద్ద సుంతైన బోనము లేదు. అనువైనచోటఁ బండ్లారగించర తండ్రి! ।యనినవిని సంతసిలి మారుతి । తినుటకై వెదకెను ఫలంబుల । నచ్యుతుని వేంకటాచలహృదయాంతరంగవిహారి పావని ॥ మారుతిచరిత॥

మారుతివిజయము

అంజనాసంజనితదైవతాఖిల కళావిభూషిత ! కంజనయన శోభిత ! ప్రభంజనసుత । పాహి । పాహి । మాం ॥ అంజనా॥

2. ఆడెడిబాలుం డైదవ । నాఁడు పొత్తులం బరుండి । వేడి సూర్యుఁ డుదయించుటఁ। జూడఁగనే పండనుకొని। యాపండును దినఁగోరుచుఁ బావఁడు మిన్నుల కెగసి ప్రతాపము శౌర్యము ధైర్యము దీపింపఁగ రవినిఁబెట్టె ॥ నంజనా ॥

3. అర్కబింబము నప్పడమువలె । నారగింపఁదొడఁగె బాలుఁడు। కర్కశదంభోళిహస్తుఁడు। ఘనుఁ డింద్రుఁడు దానిఁ గన్గొని। యక్కటకట కోఁతిపిల్ల మెక్కఁదొడఁగె భాస్కరునిఁ జిక్కఁబట్టుఁడని దానిపైఁ జేతివజ్రమును విసరెను ॥ అంజనా॥

4. ఆవజ్రము తనపైఁబడ నరుగుఁదేరఁ గనిబాలుఁడు ।చేవ గలుగు తనరోమముచేత దాని ఛేదించెను । ఈవిధమున వజ్రము చెడి । పోవుటఁగని భాషాపతి। యావానరుఁ డవనిం బడి । చావఁగ బ్రహ్మాస్త్ర మేసెను ॥ అంజనా ॥

5. బ్రహ్మాస్త్రము బాధప్పులఁ। బరఁ తెంచుటఁ గనినవ్వుచు। బెరికివేఱొక దీర్ఘరోమము । బిరబిరమని విసరివైచెను । ఆవెంట్రుక సర్వదేవ । తాంశచే మహాస్త్రమయి ప్ర । శంసవడసి బ్రహ్మాస్త్రము ధ్వంసముగావించి వైచె ॥ నంజనా ॥

6. దేవత లిఁక గతిఁగానక। పావని సంస్తుతిచేసిరి । ఓ। వానరకులకిశోర ! వీర ! యంజనాకుమార ! గౌరీశ్వరజనితసార ! కారుణ్యాపారావారా ! సురనరమునిహితకారా ! పరమభక్త మందార ॥ అంజనా ॥

7. భానుఁడు తమపంటఁజిక్కుటఁ బాడువడిమె మాకిత్రు వులు । దీనదయాళూ । సూర్యుని దినక విడిచిపెట్టఁగదే।

ఇటు వేడిన జాలిఁజెంది । పటుబలవంతుఁడు మారుతి । తటుకున భానునిఁ దావిడు । చుటఁ గని సంతసమందిరి ॥అంజనా॥

8. సలలితమారుతివిజయము । చదివిన వ్రాసిన వినినన్ । బలవంతుఁడు హనుమంతుఁడు పరమదయతోఁ బాలించున్ । విలసితవైభవములు ధీ । బలములు నాయువు తేజము । కలుము లచ్యుతుని వేంకటా । చలపతిసన్నుతుఁ డొసంగు ॥ నంజనా॥

## వరప్రాప్తి

అంజనాసుతచరితము వినవయ్య । నవరసభరితము — శ్రీమహేంద్రుఁడు తనమువజ్రము। చితుకుటాటన్ సిగ్గుపుట్టినఁ । గులిశమును దనచేతఁగైకొని । కోఁతిచెంపలు పగులఁగొట్టెను॥ అంజనా ॥

2. ఆటలాడెడికోఁతిబిడ్డఁడు । వ్రేటువడి రాళ్ళపైఁ గూలెన్ । అటసమీరుఁడు నిజసుతుఁడు పడ నధికకోపముచేత రేగెన్ ॥అం॥

3. పవనుఁ డొక్కని సుతునిఁ దక్కఁగ । జనులప్రాణంబులను గట్టెను । ముజ్జగంబులు నూర్పులాడక । మూర్ఛితములై చచ్చువడియెన్ ॥ అంజనా ॥

4. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు । నిందాది సురశేఖరులు వచ్చిరి । బాలు మూర్ఛను బాపి వారలు।వరములను గురిపింప సాఁగిరి ॥ అంజనా ॥

5. అప్రధృష్యత శౌర్య మాయువు । నమితబల తేజము లజేయత । వాక్పటిమ దయ విష్ణుభక్తియు । వేఱువేఱుగ వార లొసఁగిరి ॥ అంజనా ॥

6. బ్రహ్మయిట్లు నుతించెను। బరమాత్మవిష్ణుస్వరూపుఁడవు। నీబలముచే రాక్షసులఁద్రుంతువు సురలఁజక్కఁగ నుద్ధరింతువు॥

7. రామచంద్రుఁడు సంతసిలఁగా । జానకీవార్తను గడింతువు లక్ష్మణుని బ్రతికించుటకు సంజీవగిరిఁ బెకలించి తెత్తువు॥

8. కాన నాయందు దయఁగైకొని । మానితబ్రహ్మాస్త్రమును నవమానపఱచక యొకనిమేషము దానిచేఁ గట్టువడి యుండవే ॥ అంజనా ॥

9. పార్వతీగర్భసంజనితా ! వాయుపుత్రి ! కేసరిసుతా ! అఖిలదేవాంశసంభూతా । అచ్యుతాచలపతికవినుతా ॥అంజ॥

## సువర్చలాకల్యాణము

విను మాంజనేయకథను — మధురిమజితసుధను —
కపిసుతుఁ డటు బ్రహ్మాస్త్రముచేఁ గట్టువడుటకుఁ దానొప్పుకొనియె । నంతఁబతంగుని డాయంజని పలికెను । సుపర్వవందిత నమోనమస్తే । సాంగోపాంగము లగు వేదములను సర్వశాస్త్రములు సకలాగమములు । స్వామి! నాకు నేర్పుమనుచు వేడిన । నామహాత్మునకు భాస్కరుఁ డిట్లనె ॥విను మాం ॥

2. శ్రీహరియాజ్ఞను శిరసాకైకొని చెలఁగుదు నాకాశంబున । నన్నుఁ జేరి వేదముల శాస్త్రములను నే । ర్చుట కవకాశము లేదని రవి యన । మారుతి తుది నిర్బంధపఱచి బహుమానితుఁడై వెనుకకు బరువెత్తుచు భానుకిరణములయం దిందరి వ్యాకరణ మొక్కదినముననే చదివెను ॥ విను మాం ॥

3. ఒకపాదము నుదయాచలమున । వేఱొకపాదము పడమటిగిరియందునఁ బ్రకటాశ్చర్యముగా మోపినిలిచి సకలలోకసాక్షిని బ్రార్థించినఁ। గపివరుబుద్ధిబల ప్రభావములు గని దినకరుఁ డెంతో సంతసిలుచు నకళంకంబగు దయారసముతో నన్నిశాస్త్రములఁ దా బోధించెను ॥ విను మాం ॥

4. కపికుమారశౌర్యము ధైర్యంబును ఘనవిద్యావైదుష్యముఁ దేజము। విపులపరాక్రమమును గని సూర్యుఁడు బ్రహ్మానందరసాబ్ధిఁ దేలెన్। ఇతఁడు మత్కుమారికి సువర్చలా। సతికిఁ దగినమగఁడని మదిఁ దలఁచి ము। దితమనంబుతోఁ గూఁతును వానర। సుతుని కిచ్చి పెండిలిఁగావించెను ॥వినుమాం

5. మధుమాసంబున బహుళపక్షమున। దశమినాఁడు శని వాసరమునఁ బూర్వాభాద్రానక్షత్రంబునఁ। గుంభరాశిలోఁ గర్కటాంశతోఁ। గౌండిన్యకులంబున జన్మించెను గలికల్మషహరుఁ డగుహనుమంతుఁడు నిండుభక్తి నీజయంతి దినమున। నిరతము భక్తులు పాడుచునుండగ ॥ వినుమాం ॥

6. మా కామారుతియే కల్పతరువు। మా కామారుతి కామధేనువే మా కామారుతి చింతామణి యిఁక। మాకు భయంబు విచారంబేటికి। ఈకథ వ్రాసినఁ జదివిన వినినన్। బ్రాకటాయురారోగ్యసంపదల్। చేకూరిచి వేంకటాచలపతి స్తుతుఁడగు మారుతి వారలఁ బ్రోచున్ ॥ వినుమాంజనేయ॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఓమ్ తత్సత్.

శ్రీ సువర్చలాహనూమత్పరబ్రహ్మార్పణ మస్తు.



# ఈ గ్రంథకర్తచే రచింపఁబడిన గ్రంథములు

**వేదభూమి :—** ఆర్యులయొక్క పురాతననివాస మార్యావర్తమే కాని యుత్తరధ్రువాదిఖండాంతరము లేవియుఁ గావని సప్రమాణముగ నిరూపించు విమర్శ గ్రంథరాజము. ప్రతియార్యుఁడు చదివి సనాతనభరత వర్షప్రఖ్యాతి నెఱింగి బ్రహ్మానందమునం దోలలాడవలసినదే- రు 2_8_0

**బాల్యవివాహతత్వసారము :—** శారదాబిల్లువలన దేశమునకు రాఁబోవు గొప్ప యనర్థములను బ్రత్యేకించి సప్రమాణముగ నిరూపించు గ్రంథము- అనేక వైద్యగ్రంథములు పాశ్చాత్యవైద్యుల వాక్యములు క్రోడీకరించి యిందు వ్రాయఁబడినవి. రు 1_0_0

**మధుమురళి :—** పారశీక విద్వత్కవి యుమర్ఖయాం వ్రాసిన నీతిగ్రంథమున కనువాదముగ వ్రాయఁబడిన బన్నసరులు. ప్రథమభాగము. మిగుల రసవంతము. ఈ గ్రంథము ప్రపంచములోని సమస్త భాషలలోఁ గలదు. ఇయ్యదియే యాంధ్రప్రయత్నము.

చదివినకొలఁది రసము లూరును. 0_8_0

**అంపశయ్య :—** శ్రీ భీష్మనిర్యాణగాథను బ్రదర్శించు నాటకమాణిక్యము. ఇందలి కృష్ణలీలాభివర్ణనలు చదివి యానందబాష్పము వర్షింపని కనులు కడునరిది. కవిత్వము మృదుమధురము - పత్రికలచేఁ బండితులచేఁ గొనియాడఁబడినది. రు 1_0_0

**బాలాంజనేయము :—** శ్రీ పరాశరసంహితనుండి గ్రహింపఁబడిన యాంజనేయచరిత్ర మానసకళ్యాణపర్యంతము సంస్కృతశ్లోకములు, తెల్గు పద్దెములు, గేయములు, మంజరులు గద్యభాగములతో మనోహరముగ వ్రాయఁబడిన యక్షగానము. (అమూల్యము)

## ఇంకను ముద్రణములోనున్న గ్రంథములు

1 నియోగీశ్వరము, 2 పాండవాంకురము, 3 తానీషా, 4 సతీశచి, 5 శంకరవిజయము, 6 మణిమాల.

వలయువారు :—

 అచ్యుతుని వేంకటాచలపతిరావు,

గుంటూరు.

అని వ్రాయవలెను.